## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010002758

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
| --- | --- | --- | --- |
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీ

# అభినవ
# ఉత్తరగోధనాపహరణము.

——:౦:——

గ్రంథకర్త:

## రావి అచ్చయ్యనాయుడు.

సింహపురిమండల స్కందపురిసీమ

వలేటివారిపాలెం

కందుకూరుతాలూకా నెల్లూరుజిల్లా

మొదటికూర్పు ప్రతులు 500



రాజమహేంద్రవరము

శ్రీ సత్యానంద ప్రెస్సునం

ముద్రింపఁబడియె.

1930.

——

రు. 1-0-0

# విజ్ఞాపనము.

పరమపూజావందనీయులగు ఆర్యులారా !

ఉ. శ్రీధరనీ నియోగ్యమయి చెన్నలరారెడి భారతంబునన్
పృథివిని కొన్నిరీతులను పోల్చిరచించుటగాంచి మోద
మందుచును రచింపనెంచి యొందరెటన్ రచియించినన్వృథా
గాదుగదాయటంచు మదిబూని రచించితిగారవమీరలున్.

క. బాలురపల్కుల నెప్పుడు
ఆలించక యుందురెల్ల అర్థంబగునే
బాలురపల్కుల నెప్పుడు
ఆలించగ వలయునెల్ల ఆర్యజనంబుల్.

గాన—క. ఇందున తప్పులు యుండిన
పొందుగ విడనాడి ఒప్పులన్నియుమీరల్
డెందమునందున నుంచుడి
వందనములుజేతు ఆర్యవర్యుల్ మీకున్.

తే. గీ. తప్పులుండిన గాని దయతోడ[illegible]
నెల్ల ఒప్పులు గాగనునెడ[illegible]చి
పుస్తకంబును సభి[illegible]పొందజేయ
నాదువందన అర్హులయ్యెదరుగాక.

వలేటివారిపాలెం. }
20—8—29 }

ఇట్లు
గ్రంథకర్త.

## —♦ యిందువచ్చుపాత్రలు ♦—

### పు రు షు లు.

సూత్రధారుడు

దుర్యోధనుడు (హస్తినాపురిపురాజు)

(కౌరవయోధులు)

కర్ణుడు

శకుని

భీష్ముడు

ద్రోణుడు

కృపాచార్యులు.

అశ్వత్థామ

కంకుభట్టు—ధర్మరాజు

వలనుడు—భీముడు

బృహన్నల—అర్జునుడు

దామగ్రంధి—నకులుడు

తంత్రీపాలుడు—సహదేవుడు

విరాటుడు—మత్స్యపురాధీసుడు

వుత్తరుడు—విరాటునిపుత్రుడు

శ్రీకృష్ణుడు

బలరాముడు

అభిమన్యుడు

### స్త్రీ లు.

నటి.

సైరంధ్రి—ద్రౌపతి.

ఉత్తర—విరాటునిపుత్రిక.

ఈనాటకమునందు యింకను అంతఃపురస్త్రీలు మందగొల్లలు పురోహితులు సేవకులు మొదలగువారువత్తురు.

# ప్రార్థనము.

సీ. దంతితొండముతోడ ధరలోనపూజించి
విఘ్నేశ్వరుండన వరలెనెవడు
బ్రాహ్మరూపంబున విద్యలకధికుడయి
వామనరూపుడయి వరలెనెవడు
పార్వతీశివులకు పుత్రుడయి జన్మించి
కుసుములుగోరెడి కుర్రడెవడు
మూషకవాహనుండయి ముదమొప్పగా
జనులచే నుతియింప జనునెవండు
గీ. సకలవిద్యలకెల్లను సంభ్రమమున
ప్రార్థనంబును గొనుటచే ప్రబలునెవడు
మహితబాంధవుడయిన మహేశుపుత్రు
డనగ వెలయు విఘ్నేశ్వరు మదినిదలతు.
గీ. కమలగర్భోద్భవుని సతికంజనేత్రి
విమలమతితోడ దలచివిద్వత్కవీశ్వ
కేశులగు పూర్వకవివరుల వినుతిజేసి
నాదువంశేశుడగు రామచంద్రుదలతు.

## సమర్పణము.

గీ. నాదుకృతమయ్యు యుత్తరగోధనాప
హరణమనునాటకంబు హరిసాక్షిగాను
మహినివల్లెట వాస్పురి మందిరుండు
రామచంద్రుని కర్పణగాగ గూర్తు.

## మ ం గ ళ వా క్య ము.

క. పాండుగనాచే విరచిత
మందిన యీనాటకంబు మహీలోపలనా
చంద్రార్కముగను దనరును
అందాఅరవిందనయన అంబుధిశయనా





అ భి న వ

# ఉత్తరగోధనాపహారణము.

## ప్ర థ మాం క ము.

(సూత్రదారుడు ప్రవేశించును. పుష్పాంజిజేసి)

ఉ. అలవైకుంఠపురంబులో నగరిలోనామూలసౌధంబు దా
పలమందారవనంబులోపలను లక్ష్మీదేవిసయుక్తుడై
యిలసంతోషము మించిభక్తులను గాపాడన్ మదిన్ నెంచు నా
నలినాక్షాంబుధి శయనుఁడొసగు మీకున్ స్వంతతారోగ్యముల్.

ఆహా యీసభనువర్ణింపవే నోళ్ళుగల ఫణీంద్రునకయినను సాధ్యమగునట్లు తోచకయున్నది. యీసభనెల్లశృంగారమయియుండు దేవరాజసభనుబోలియుంటగాంచి వీరినెటులయినను ఆనందసాగరమగ్నులనుజేయవలయునని నామనంబు సంతాపమొందుచున్నది. అయినను వీరినెల్లమనోరంజన జేయుదునాయని సందేహముగల్గుచున్నది. (ఆలోచించి) కానీ నాప్రాణేశ్వరితో నాలోచించెదను. నటీ. ఒకసారినీనవరసమృదుపల్లవంబయిన మోముతిలకింపజేయుమా—

నటి—ప్రాణేశ్వరా నన్నురావించికతంబేమో వినగోరెద?

సూత్ర—సఖీ కల్పతరువుబోలియున్న సభనువర్ణింపుము.

నటి—మున్నుధర్మజుడింద్రప్రస్తపురంబునందు
యశ్వమేధంబు యొనరించుకాలమందు
దేవమునిరాజ విదితమయి యొప్పుసభను
బోలియున్నయీసభ తేరిచూడ.

సూత్రి—ఆహా నీయొక్క మృదుమధుర రసోక్తులచే కమలముః భ్రమరముజొక్క్యమధురంబు గ్రోలిరంజిల్లుకరణి నామనంబు పులకాంకురంబయ్యె అదియునుంగాక నాయొక్క సందేహమునివర్తించె

నటి—నాథా అట్టిసందేహంబెద్ది. అదియెట్లునివారణంబయ్యెనో దెల్పుము-వినగోరితిని.

సూత్ర—సఖీమణి యీసభను యెట్లురంజింపజేయుదమా యనిసందేహముండెనది నీప్రథమ్మజుని సభయనినంతనె యీసభనుధర్మ నీయంబగు భారతకధచే రంజింపజేయగలననియూహించె.

నటి—భారతమననసాధ్యమయిన మొకమయి యుండె. అటువంటి భారత కథను ప్రదర్శింపసాధ్యమా అయిననొకరాత్రి ప్రదర్శింపగలమా.

సూత్ర—భారతమంతయు వలనుపడునా అయినరాత్రి ప్రదర్శించుటకు వీలవునా కానయందొకస్కందముమాత్రము.

నటి—ప్రాణనాయకా అటులయిన నేభాగము ప్రదర్శింతమని మీయుద్యమము తెల్పుము

సూత్రి—బాలామణీ.

గీ. కురుకులాధిపు బలములదాడివెడలి
మత్స్యభూపతి దేనువులపహరింప
యుత్తరునిగూడి యర్జునుండు గ్రిముగను
పశులవెక్కుడు గొనిపోవు పరుషకధను.

నటి—ఓహో! యిది యేకదా యుత్తరగోధనాపహరణము. "నాథా" చిత్రిమేమియోకాని యీనాటకరాజమును తలచినంతనే నా మనముప్పతిల్లుచున్నది. యీనాటకమునభినవముగా రచించిన వారెవరో శ్రవణానందముగా వినగోరెద తెల్పుము.

సూత్ర—సఖీమణి గ్రంధకర్తతో నవసరమొందుటకు, వరరసగాంభీర్యసా

హాసమగు శైలిని రచియించినందున కథ రసవంతము గదా కావలయును.

నటి——జీవితేశా! అయిన నాబాలగోపాలము నామము విన గోరెద తెల్పుము.

సూత్రి——ప్రేయసి! మనచిరకాలమిత్రుండగు యితను.

గీ. పృథ్విలోన వలేట్వారిపురమునందు
రావివంశాబ్ధిచంద్రుడౌ రమ్యగుణుడు
అప్పయామాత్యద్వితీయతనూభవుండు
అచ్చియాఖ్యుండె నీకృతిని అవనిపల్కె.

నటి——ఓహో! యితనా మున్నితడు గజరాజచరిత్రమును రగడగారచి యించె మరల దీనిరచియించెగాబోలు.

సూత్ర——గ్రంధకర్తతాను పదునెన్మిదవవత్సరమున నేనీరెండుగ్రంధ ములవ్రాయనుంకించి రచియించె.

నటి——సరి. సరి. తెలియునులే మున్నునేనెరుగుదును.

సూత్ర——నటిప్రొద్దగుచున్నది మనముండరాదు ఋతువర్ణనమొనర్చుము

నటి——యేఋతువునుగూర్చివర్ణించెదను.

సూత్ర——యేదంనేల వసంతమేకదా.

నటి——గీ. కనులపండువుగాగ వసంతఋతువు
వృక్షతతులుచిగిర్చియుల్లాసమొప్ప
మనమునకెంత యానందముప్పతిల్లె
ఋతువులరేడు యనదగువసంతఋతువు.

సూత్ర——నటి వెళ్లుదమురమ్ము.

(నిష్క్రమింతురు.)

(తెరవ్రాలును.)



అభినవ

# ఉత్తరగోధనాపహరణము.

## ప్రథమాంకము.

ప్రథమరంగము—సభామంటపసీను, దుర్యోధనునికోర్టు.

(దుర్యోధన, దుశ్శాసన, కర్ణసభికుల ప్రవేశము.)

దుర్యో—మిత్రమా! ప్రభాకరతనయా? యీదినంబున నామనంబు కలతనొందుచున్నది. పాండవులనెదుకుటకుజనిన చారులు యింతవరకును రాకయుండిరి. పాండవులజాడలుదొరకుటదుర్లభమయి యుండునేమో పాండవులను జయించుటకు మార్గముతోచకున్నది. చారులు నేడోరెపో చనుదెంతురు. తదుపరి కారణమరిసి వలయుకార్యము నాలోచింతముకాని నీయాలోచన యేమో తెల్పుము.

కర్ణ—రాజా తెలియనివానివలె నడిగెదవేల నాచిత్తవృత్తియెల్లప్పుడును నాకౌంతేయుల దునిమి రాజ్యభారమును నీశిరమునందుంచి గజపురసింహాసనాసీనుంజేసి చంద్రవంశమున నాచంద్రార్కముగా నెగడుచున్న నవరత్నస్థాపనమగు మకుటమును నీశిరమునందు జేర్చి నాకనులార నెన్నడుగాంతునాయను చింతదప్ప వేరొక చింతలేదు.

దుర్యో—అంగరాజా పాండవుల జయించుట నసాధ్యమయినను అక్షిపుత్రేక్షులయిన మరల ద్వాదశవర్షంబులు కాననాంతరమునను నొకవత్సంబు నజ్ఞాతమును జలుపడిలేకయుందుముకదా?

దుశ్శా— అన్నయ్యా పాండవులజాడలు వెదక బయలువెడలిన చారు లువచ్చి సింహద్వారమున కాచియున్నారు.

దుర్యో—తమ్ముడాదుశ్శాసనా వారినిత్వరితముగా తోడ్తెమ్ము.

(చారులు ప్రవేశము.)

చారు—వందనము. దుర్యోధనమహారాజా పదివేలవందనములు.

దుర్యో—(తలయూచి) చారులారా పాండవులజాడలు కనుగొని వచ్చి తిరా లేక రిత్తయుంటరా

చారు—దుర్యోధనరాజచంద్రా, మాయిడుముల చెప్పుటకు సాధ్యమా అయినను.

సీ. ద్రవిడకర్ణాటాంధ్ర త్రిగర్త దేశంబుల
కానగలేరు కౌంతేయవరులు
మాళవనేపాళ మగధఘూర్జరదేశ
పాలనంబున లేరు పాంచాలివిభులు
భోజకళింద పుళిందదేశంబుల
పూజ్యపాండుమహీశు పుత్రవరులు
బర్బరసింధు బంగాళరాజ్యములలో
కనరారువారిని కనగ పేరు

గీ. దేశదేశంబులను మేముతిరిగితిరిగి
మనసువర్జించి పురిత్రోవమరలినాము
అవనిమనుదురో లేకయజీవులయిరో
చెప్పజాలము క్షేమంబుకురుకులేంద్ర.

రాజచంద్రా అదియుమంగాక.

క. కొండలుగుహలును వనములు
మెండుగ నది విపినభూమికోలనులు రాజా

ఖండితముగ మేమెంతకియు
చండాంశుప్రచండ చాలచాలెక భూపా

అదియునుంగాక మరలివచ్చినపుడు నొకవిచిత్రమునువింటిని. అది యేమన మత్స్యదేశంబున విరాటనగరంబు.

గీ. మత్స్యభూమీశు మఱదియగు సింహబలుని
కలికికోసము గంధర్వ దకాలమందు
చూడచిత్రముగాగను సంహరించి
విగతదేహుని నొనరించె విభువచంద్ర.

దుర్యో—రాధేయా వింటివా! ఆవనిత యేద్రౌపతియు గంధర్వుడే భీముడునయియుండును. యేలయనసింహబలునిజయించుట భీముడు తప్ప మరియెవ్వరును దాకజాలరు అందువలన పాండవులు మత్స్యనగరంబున యున్నారనుటకుసందియములేదు. రాధేయా ఆయన మామగారగు శకునితో ఆలోచింతము. (సేవకాయిటురమ్ము.)

సేవ—చిత్తము ఆజ్ఞయేమి.

దుర్యో—నీవతివేగంబున అంతఃపురమునకుజని మామామయగు శకుని త్వరితముగా తోడ్తెమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

---

—♦ ద్వితీయ రంగము. ♦—

(ద్రోణ, భీష్మ, దుర్యోధన, కర్ణ, దుశ్శాసన, శకుని ప్రవేశము.)

గహస్యస్థలము.

దుర్యో—మామా శకుని నిన్నటిరోజున చారులువిన్నవించిన సమాచారము తెలియునా.

శకు—కురుభూపతీ! యేమి చారులువచ్చిరా చారులువిన్నవించు సమాచారమువినగోరెద.

దరువు—ద్విపద.

శ్రీవీరరాజేంద్ర! శకునిమహారాజ.
నావిన్నపంబిను నలినాక్షతేజ
కౌంతేయువార్తలు కనుగొనవెడలి
నట్టిచారులునాకు నయముతోనిపుడు
విన్నవించిన యెట్టి విస్తారశయము
వినిపించెదను విను వియసీతిచంద్ర
మహిలోపలను ఘనమత్స్యపురమందు
మహిపతి విరటుని మరది కీచకుని
వనితవ్యవరంబున వక్కనిశిరాత్రి
కనుగొన నొక మహాశంతీరబలుడు
గర్వాంధుడయినట్టి గంధర్వుడొకడు
అర్ధరాత్రంబున నరుదెంచినతని
విపతిదేహునిజేసె విశ్రుతంబుగను
వుపకీచకులజంపె యుర్వీపయినపుడు
అంతట బలశాలి అంతధీరుండు
అంతటమోరమవు అంతగాంభీర్య
గర్వాంధుడేభీమ గంధర్వుడనియు
అరవిందపాంచాల అంబుజాక్షినియు
మహిలోన యామత్స్యమహిపతియొద్ద
మహిపతిపుత్రులు మరుగుగానడచి
బ్రతికియున్నారని పట్టుదలగాను

మదిదలచినాడను మానవాధీశ
నీమనమందున నిశ్చయుంబయిన
ఆత్మాత్మ వినవొప్ప అవనీశచంద్ర
రాజశ్రీమహారాజ రాజరాజేంద్ర
రాజీవస్తుతివంద్య రణవీరచంద్ర,

అటుగాకుండిన కీచకునిజంపనే జీవతాంశునిచేతగాని నెరవేరదనియు, నా యభిప్రాయము.

శకు—మందీ గజపురాధీశ ! లెస్సగానాలోచించితివి. అటులనే జరిగియుండుననియే నాయభిప్రాయము అంగరాజా, మీయొక్క యాంతర్యము బహిరంగపరచుము.

కర్ణు—శకునిధరానాథా ! నాయభిమతముసల్లే యీమ్సుకొనిపోవుచూయున్నది అదియునుంగాక యల్లకాలంబునందునను పాండవులున్న దేశముపశుజనసస్యసమృద్ధియై నిరతము వర్షములువర్షించి సుభిక్షముగాయుండును. నేటికాలమున మత్స్యదేశముయటులనేయుండెనని వినియుంటిని. కాబట్టి పాండవులేవ్వరును సందియములేక నానగరమున వర్తించుచున్నారు.

దుర్యో—అంగరాజా! అటులయిన మనముసైన్యసమేతముగా వెడలి మత్స్యనగరంబునుజొచ్చి పాండవులనుగనుగొందము అదియెటులనప్రదమమున మన సుశర్మనుబంపి మత్స్యభూమీశుగక్షిణభూమియందుయుండు దేనువులను నపహరింపజనవిచ్చిన విరాటుని రణసన్నాహంబంతయు నటువెడలిపోవును. తదుపరి సర్వసైన్య గురుపితామహగురుపుత్రు అంగరాజాబంధువర్గసహితముగా వెడలి విరటుని యుత్తరగోధనము లపహరింప పాండవులున్న

యడలబయల్వెడదురు లేనియడలమనవిరోధియగు విరటునిసంహ
రించివారిరాజ్యమపహరించుదము యిదియేనామనోనిశ్చయము

శకు— భేష్! బహుమంచియాలోచనకుదిరినది. తడవుసేయకుము ఆల
స్యమయిన వోపదమూడేండ్లు పూర్ణమగుచున్నది. సైన్యమును
ఆయత్తపరుచననుజ్ఞయిమ్ము.

దుర్యో—అటులయిన నొకరిపట్టుదలతో సాధ్యమయిభేదించనలవియగు
కార్యముకాదు. కౌరవీరులందరును యీకార్యమును శిరసావ
హించి నెరవేర్చవేడెదను. తాతా! శంతనపుత్రా! పరమ పూ
జ్యుడవయిన నీభుజస్కంధమున యీకార్యమాసిన పట్టాభిషేక
మొనర్పించితిని. తరువాత నీయిష్టము.

భీష్మ—(తనలో) హా ! దైవరాయా!

శా. చింతలు నొందగావలసె సేనమహారధకత్వమంబునన్
ఎంతయు గాసిజెందియిటు కాటమెరుంగకహారవశమునన్
వింతలు క్రొత్త క్రొత్త ప్రయోగములన్నియు నొకటుగాగ
కౌంతేయులకెంతకష్టదశకాలమగూడెను ద్వారకాధరా.

అదియునుంగాక నాధర్మపరులయిన పాండుభూమీశతనయులు.

గీ. పాండురాజమహీంద్రపు పుత్రులయ్యు
నాదుచేతులలో గారవమున బెరిగినట్టి
నట్టిపాండవులెట్టి యనాథలయిరి
వారికి యిలపుటయరుగనువారిజాక్ష.

(ప్రకాశముగా) కౌరవాగ్రజా నీవాక్యమును శిరసావహించెదను.

దుర్యో—సభికులారా! మీరందరును నాయందు దయయుంచి యిప్ప
ట్టున సంపూర్ణానురాగమున సాయమొనరించగోరెద.

అందరు—అటుచేయుదుము.

దుర్యో—సేవకా!

సేవ—యేమి సెలవు.

దుర్యో—గీ. రేపుపుదయమునందు విరాటుపురికి
చనగవలయును చయ్యన జనియునీవు
క్షితినొందెడి రణభేరి వేృయుడిపుడు
సైన్యమంతయు సమకూర్ప నెరుకపడగ.

సేవ—చిత్తము. నిష్క్రమించును.

(తెరవాలును)



శ్రీ

అ భి న వ

# ఉత్తరగోధనాపహరణము.



—♦ ద్వితీయాంకము. ♦—

## ప్రథమరంగము—అరణ్యసీను.

(మందగొల్లలు సురభులు ప్రవేశము)

సడ్డికోటడు—ఓయ్! వుయ్యెముంతకట్టుపిచ్చినోస్లె నీపాసుగాల యాం దోయి యియ్యాలమనరాజు సయిన్యసమ్మేతంగా యాడ్కో పోయిండంట.

పిచ్చన్న—అదిగాడోయ్, నీయొగ్గాల దచ్చినుంగున్నావలయేనోతోల్క పోతుండెపోయిందంటోయ్ వానెమ్మనెత్తిమాసినకొడ్కు మనమ యితెమోరుగోల్తా పొడవక రాజుకు చెప్తమంటోయి. నెత్తి గాల్నినాయాల్లవుచేతగాకపుర్కిందుగాని.

పుల్లాపుల్రెన్న—నగ్నోయి అటుమాకండో యి. అదెంది నీయమ్మ జిగడ. అయ్యెంగురాల్లు అయ్యెంమొంటులు అయ్యెమేనేగలు యిట్టొంత్తుండయేమోయి చీ యొగ్గానకొడ్కా.

పిచ్చన్న—సాములాలా యిట్టొంతుండారేడికయ్యా యాడ్కొ చెప్పండి దోవజెప్తము. వ్రాళ్ళోరాజుగారు తేరు పట్టంలోనికిపోతారా యేమి.

దుశ్శా—మందగొల్లలారా! మీరాజుగారువెచ్చటకి చనుదెంచియుండి రి. యిప్పుడునగరమునందెవరున్నారో తెల్పుడు.

గొల్ల—సామో ! మారాజుగారి ఆవులయేరోతోలుక్కొనిపోతుండేను. యుద్ధానిపోయింరోటు.

దుర్యో—(తనలో) యిదేసుంచితరుణము. భటులారా దేవపులను మనపురమునకు మరలించుడు.

(భటులు దేవుల మరల్పనుందురు.)

పిచ్చ—దేయ్యిటబోద్దెందిరా యోరయ్యా ఆవులతోల్తారు యేనాడికి తోల్తారోకానిమరి.

దుర్యో—మందగొల్లలారా ! మేము కురుసేనలము. విరాటుని గోవుల కొంపోవుటకయి యిటుచనుదెంచితిమి. మీరుపురంబునకుపొండు

యర్రన్న—యేాందిరో నాయాల్లాల! కురుసేనుఆయ్యేది. గొర్రుసేను అయ్యేది ఆవులబోనియ్యము.

దుర్యో—గోపాలులారా ! వృధాప్రయాసనొందకుడు.

యరన్న—పయ్యాసలేదు. కిందాచాలేదు నీయబ్బాబ్బినా తోల్ని య్యాను. తోల్తే మోరుగొలిరుగుద్దినాయాల (అనికొట్టును).

దుర్యో—గోపాలులారా! యివిగో శరములుకాచుకొనుడు (శరములు విడచును) గోపాలురు సైన్యము యుద్ధముచేసి గోపాలురు వెళ్ళుదురు. (తెరవ్రాలును.)

---

## —♦ ద్వితీయ రంగము ♦—

(ఉత్తరుడు అంతఃపురస్త్రీలు పాచికలాడుచుందురు)

(మందగొల్లలు ప్రవేశము.)

గోపాలులు—వుత్తరా, వుత్తరా, ప్రాణముదక్కించుము. రక్షించుము రాజపుత్రా.

ఉత్త—(నివ్వెరజెంది) గోపాలులారా యేమియాపదచేగూడెనో తెల్పుము మీకొక్కయాపద బాపెదను.

గోపా—గీ. వంచనంబిసె యుత్తరవరగుణాఢ్య
ధార్తరాష్ట్రుని సుతుండు దుర్యోధనుండు
తనచతుర్విధసేనతో తర్లి మనదు
గోగణంబుల వెడలించె గజపురంబు.

ఉత్త—(కోపముతో) హా! దురాత్మా సుయోధనా ఎంతక్రూరకార్య మొనరించితివిరా మదాంధ.

గోపా—ఉత్తరా! రాజూరలేడు. గోవులుచాలాదూరమున వెడలిపోవు చున్నవి. సైన్యముచూడ చతురంబోధిబోలి యచ్చట జూచి నను రామశబ్ధమయియున్నది. కావున

శా. వేగమెదల్గు యుద్ధమునకు యుత్తరధేనువులన్ మరల్వగన్
మక్కువతోడ నీదగుబలంబును రాజసభాస్థలంబునన్
మిక్కిలి నేర్పుగాను నినుమెచ్చుచు బొగడుచునుండుగాంచు
యూగండము బాపి రాజునిను ప్రేమను నొనర్చెరీతిజల్పుమా.

ఉత్త—యేమిరా దుర్యోధనా మాతండ్రి పురంబున లేకయుండుట గాంచి దండెత్తివచ్చితివా అయినను లోకగాంభీర్యరణశూర దిగ్విజయుండగు భూమింజయుండు లేడనితలచితివి కాబోలు. గోపాలులారా మీరుపోండు భయమందకుండు.

ఉ. అనయము కౌరవాది త్రిజగంబులు నొక్కట నెత్తివచ్చినన్
వనజభవుండు దేవగణయుతంబుగ తానెదిరించివచ్చినన్
కదనమునందు కౌరవుల కల్పడి శిరములు ద్రుంచివేసి గో
గణము మరల్చితెచ్చెదను రథంబును తెమ్మిట వేగసాహిణీ.

అదియుయుండగాక.

శా. పురమునయుండు సేనలను రధ్యములున్ విలుకాండ్లువీరులున్
సారథులున్ రథంబులు యేనుగులున్ యలమాష్టివారలున్

ఉష్ట్రములుఁ సమస్తపరివారము దక్షిణగోగణంబులఁ స
డరి త్రిగర్తదేశుఁడు హరింపగవాసి నెమర్చోనఁ జనెన్.

అందువలన యీపురంబున మొలత్రాడుకట్టినబాలుడయినను కన
రారు. యీసమయానుసందర్భమున సారథిలేఁడు అందుకతన
యుద్ధమునకు బయల్వెడలుటకు సందేహముగాయున్నది. పేరు
నకు సారథియున్నయెడల.

క. పేరుకు సారథియుండిన
మారునిసరి కౌరవాబ్ధిజొచ్చియు సేనన్
ఘోరముగ వైరివీరుల
వీరుడనయి చంపనేర్తు యీక్షణమందున్.

సేవకా యిటురమ్ము.

సేవ—చిత్తము.

ఉత్త—నీవు వెడలి పురమంతయు వెతకి పేరుకు సారథిగా యుండుటకు
మొలత్రాడుకట్టిన బాలునయినను తోడ్తెమ్ము.

(నిష్క్రమించును).

---

## —♦ తృ తీ య రం గ ము ♦—

బృహ—ఆఆర్తరక్షపరాయణా! మేమీయిడుముల నెన్నిదినము లను
భవించవలయునోకదా మేమందరము ఒకచోటనుండియు ఒక
రొకరుచూచుటకును భగనత్ప్రాప్తను లేకయుండెగదా! నా
దుర్మార్గులయినకౌరవులెంత. యత్నముసాగించిరి, మమ్మెన్నియి
డుములగుడిపించిరి. [కోపముతో] ఒరేమధాంధా సుయోధనా!

వట్టాది—గీ. ఘోరరణముననిన్ను ఘోరముగను
పుత్రభ్రాతృాది బంధువర్గంబులో నీ
సైన్యసామంతభూజనసంకలితముగను

కాలుపురిజేర్చు కౌన్ననోకతినచిత్త
పాండురాజమహీపతిపావనంబు
జెందినట్టియు వంశమేస్థిరమెయగును.

(బరిహాస్యుడై.)

మనసేనల తొందరించెదవు. యిచట యెవరునులేరే [ఎదుటజూ
చి] అదిగో పాంచాలిరాజతనయగాబోలు నిటువచ్చుచున్నది.

[కూర్చుండును].

(ద్రౌపతిప్రవేశము)

ద్రౌప—ప్రాణేశ్వరా! పదివేలవందనములు.

బృహ—దీర్ఘసుమంగళభవయై వర్ధిల్లుమునాయకి.

ద్రౌప—ప్రాణనాధా! కురుబలంబు వచ్చి దేశువుల తోలుకపోవు
చున్నారట ఉత్తరుడు రణమునకు జనుటకు సారధి లేనికతంబున
నిర్విష్టుడయి యున్నాడు. మనమజ్ఞాతము పూర్తియయినదా లేదా
లేకయున్నచో.

గీ. కౌరవాధములందరు కపటమునను
మత్స్యభూమీశు సురభుల మందలించి
ఆయకట్టునుగట్టి రరణ్యమందు
యేమికాలమొ ప్రాణేశ యెందుకతనో.

బృహ—ప్రాణేశ్వరీ! భయమందకుము.

గీ. నిన్నరోజుకు నజ్ఞాతనిష్ఫలంబు
గడువువెళ్ళెను మనమికకువలయాక్షి
బయలువెడలిన మోసంబుపారదెంచు
కానిభయమందుటేల కంజాయతాక్షి.

అయిననీవుత్తరుపాలికిఁజని యిదివరకోనింద్రప్రస్థముబృహన్నల నెరుగుదుననియు.

గీ. కాండవంబేర్చునప్పుడార్జునేశు
   సుతుకుపేడిని సారథిగవలయుతోఁచె
   విజయనామంబుసిద్ధించె విజయునకును
   నతనిసారథ్యమునుదెల్ప నలవియగునె.

అంతియేగాక నాబృహన్నల నొగలలోనాసీనుండయి యుండ రథంబు గగనమార్గంబున బోవుచుండుననియు నలువయయినను, శైలాపతియయినను నేలునసాధ్యంబనియు యింకనుపరిపరి విధములని యొక్కచాతుర్యమున నతనిమెప్పించి తుదకు నన్నుసారథిగా నొనునటులయొనగూర్చుము. తరువాత కురువీరుల నిర్జితులం గావించెద.

ద్రౌప—ప్రాణేశ్వరా! మీరాయొక్క దయార్ధహృదయము నాయందుయున్నచో నాచాతుర్యమున నిన్నుసారథిగా నొనునట్లొనర్చెదను నాయదృష్టము మీాదయ యెటులుండునో సెలవొసంగుము. వెళ్ళెదను.

బృహ—నాయకీ వేమరక నీవీకార్య మనుకూలమొనర్చుము వెళ్ళుము.

నిష్క్రమింతురు.

(తెరవాలును)

---

—♦ తృ తీ య రం గ ము ♦—

(వుత్తరుడు అంతఃపురకాంతలు)

వుత్త—చెలులారా! యీపురంబున సారథిలేమింజేసి నాప్రియంపుతండ్రికి ప్రియమొనగూర్ప జాలకపోయితిగదా. సారథిలేకయున్నను నొక మొగబాలుడుయున్నయడల పేరుకుసారథిగాయుంచుకొని రథి

కత్వమును రథత్వమును నేనేనెరవేర్చువాడ బౌలామణులారా సారథియున్నయెడల.

గీ. భీతినొందక భీష్మద్రోణాదికర్ణ
సింధసౌబల సోమదత్తాదిబంధు
దుర్భసైన్యంబు దుర్యోధనాదిమేట
వీరులనుక్రమించి వాహ్వానమొంసువాడ.

సైర—ఉత్తరా! మీరింత విచారించతగదు. మీరర్థించినయెడల నొక దివ్యసారథి యీపురంబుననే యున్నాడు.

ఉత్త—సైరంధ్రి! యేమోయెరుగనటుల వీక్షించెదవు. మాకగుపడక మనపురంబున సారథియవర యుండెను.

సైర—విరాటభూనాథతనయా! నామనవంగీకరించుము. మనయంతః పురమున బాలికలకు నృత్యమునేర్పు నృత్యగురుడయిన బృహన్నలయే మున్నతడును.

ఉత్త—(కోపముతో) అహా! సైరంధ్రీ! యెంతనీచపు పల్కులాడితివే నీకింతకావరమెక్కెనదా రారాజపుత్రుడనయియుండి సారథి లేడనివచింపుచుండ నిన్నెవరో పిలిచినటులవచ్చి బృహన్నలను సారథిగా నొనర్చుమందువా! సైరంధ్రీ.

ఉ. పురుషుడుగాడునాతడు పృథివీస్థలియందున వట్టిగాడు
నారదమునిదోలుసారథికి నాబృహయన్నలయర్హుడగునేమో
సురసభిమాలినీయటులు నన్నపహాస్యముజేయజెల్లునే
మరియిటువంటిపల్కులును పల్కినశీర్షముద్రొల్లనేసెదన్.

సైరం—మత్స్యతనయా! ఆగ్రహము సేయకుము. నేనుమీబోటుల యొద్ద పరిచారికనయి యుండి మీబోటులనపహాస్యమాడ నర్హత గలదాననా అయినను మున్ను నేనింద్రప్రస్థంబున నీబృహన్నలను బాగుగా నెరుగుదును. కావునవచించితిని.

ఉత్త—యితను యింద్రప్రస్థపురంబున యేకశతంబునయుండెను. నీవు నచ్చట యెందునకుగాను నచ్చటయుంటివి.

సైర—సుదేష్ణగర్భసుకుమారా! మున్ను నేనింద్రప్రస్థపురంబున పాండవ పత్నియయినద్రౌపదిసేవా నియమబూరమునపరిచారికగాయున్నందున నీబృహన్నలనచ్చట నృత్యగురువుగాయుండె నాకాలంబున పాండవమధ్యముండు కథనోత్సవమునకు జనునప్పుడు నితనిని సారథిగా గొంపోవుచుండె నారహస్యము నెరిగినదాననగుటచే విన్నవించితిని. నాబృహన్నల నొగలలోయున్న.

క. అశ్వములు గగనమార్గమున
దృశ్యముగా జనుచునుండుఘోరంబగు నా
విషయంబునందు విభునకు
కుశలంబయి జయముగల్గుశూరత్వమునన్.

కావున నాబృహన్నలను సారథిగాగైకొనుము

ఉత్త—సైరంధ్రీ! అధికప్రసంగ మొనర్చెదవేల యింద్రప్రస్థపురమున నీవేడిరూపుని విజయుండెరణమున సారథిగాగొంపోయెనో యెరిగింపుము. లేనియెడల నిన్నీకరవాలమునకు బలియొసంగెద.

సైరం—భూమింజయా విజయుండు నీబృహన్నలను.

గీ. యెవుడు విప్రచ్చుడీవేడిరూపితోడ
వాహ్వానంబునకేగెనో వెరుకపరచు
మాలినీయని నుడివితివిమాన వేళ
పూనిదెల్పెదవినుము భూనాథచంద్ర.

ద్రౌప—విరాటభూనాథతనయా ! మున్ను పాండవమధ్యమునకు నీ బృహన్నల.

సీ. దండివారలు కాలకేయులధరగూల్చు
సమయము నితడెసారథిగయుండె

ఖాండవనము దహించి గాండీవంబు
చేగొనునపుడు సారథియితండె
యింద్రప్రస్థపురంబు యేలుచు శత్రుల
నుకుమారునపుడు సారథియితండె
హయమేధయాగంబు భయము లో నొనగూర్చు
కీర్తిగాంచెడి సమఖ్యాతుడితడె

గీ. సౌఖ్యమొనగూర్చు సారథ్యచతురతంబు
శూరునకు దెల్పు నొనగూర్చు చిత్రగతిని
వేడ్కనయ్యర్జునుడువడసె విజయుడనన
నితడు సారథ్యమునుగూర్చు పార్థనాథ.

ఉత్త— చెలీ మాలినీ! నీవేసమయమునయినను నితనుసారథ్యము చేయు కనులార చూచుయుంటివా లేక యిర్వురేకనగరంబునను ఉంటం జేసి జనులాడువాక్యముల వినియుంటివా.

ద్రౌప— జననాథాత్మజా! వినియుండుట కాదు. కనులార చూచియుంటి ని మున్ను యింద్రవనము దహించునపుడు నీబృహన్నలను కిరీటి సారథిగానియమించె. యుత్తరా యింద్రప్రస్థపురంబునయున్న సారథులకంటె రూపవంతుడని యీతని సారథిగా నొనెనా యితని యందెంతప్రభావములేకయున్నచో నా పావనందనుడేలయితని ప్రేరేపించును. నాసమయంబున నీవేషి సుర చిత్రముగా రథంబు తోలుచుండెనట అటుపిమ్మట నెచటనయినను రణమునకాహ్వా నించినచో నితనిచే సారథిగా నరుండు గొంపోవుచుండె సారథి యే యననేల అవశ్యమున్నచో రథికత్వమునుగూడ నిర్వహించ నోపునట. యుత్తరకుమారా! నేనెరిగినదాననవుటచే తెల్పితిని. అటుగాక నీబృహన్నల—

గీ. మేఘసందేశమయిన మార్తాంశుపగిది
మూగవలెనుండు నీమహనీయఘనుడు
వీరపౌరుషగాంభీర్యవీరవరుడు
క్రీడిబోలియు రణకేళి జేయనేర్చు.

ఉత్త—రమణీమణి అటులయిన నాబృహన్నల యిటకువచ్చి మార్గమర యనోరెద.

ద్రౌ—మత్స్యజననాథతనయా!

శా. నీదగుచెలియలుత్తరకు నృత్యమునేర్పు గురుండుగావునన్
భేదముభేదమయి జెలగు విరాట్ప్రభుపుత్రిక నతనిచెంతనున్
పుత్తరబంపి పేడినిటు వేగను యాజ్ఞనొసంగియుత్తరా
ఖాదగనిష్ఠురంబుగను సారథిగాగొను భూపనందనా.

ఉ—సేవకా యిటురమ్ము.

సే—స్వామీ! వచ్చితిని. (ప్రవేశించును).

ఉ—ఫణిహరా నీవీక్షణంబునవెళ్ళి నాముద్దుచెలియలగు నుత్తరనిటకు దోడ్తెమ్ము. కాలయాపనమొనగూర్పకుము.

నిష్క్రమించును.

(ఉత్తరప్రవేశము).

ఉత్త—అన్నయ్యా నన్నిటకురావించుటకు కతంబేమో వినగోరెద.

శా. చెలియా యాకురురాజచంద్రుంకుబలంబుల్ గూడి తావచ్చి
భూమిలోజొరబారి ధేనువులఅరికట్టించిగోపాలురన్ ధీ
రలాఘుంబుననొచ్చిజేసినిటుకు భువిబోధిలోముంచగా మ
త్కళకడ్గాహుతిరణము సల్పుటకులేడాయిందుతగుసారథి.
నాయభ్యంతరముంగూర్చి నీనృత్యగురుండయిన బృహన్నల సారథ్యము నొసగూర్చునని వినియుంటి. కావున నతనిరావించు టకొరకు నిన్నురావించితిని. నీవు

గీ. రాజ్యలక్ష్మివిభవతముండెనేని
సోదరావాంఛనాయందు సొరిదెనేని
చారుప్రియభక్తిచాంచల్యచలనమేని
నృత్యగురువును వోడ్తమ్ము నృపకుమారి.

ఉత్త—అన్నయ్యా! భవదాజ్ఞశిరసావహించి బృహన్నలనుతోడితెచ్చెదను. రణమునకుసిద్ధపడుము.

నిష్క్రమింతురు.

(తెరవ్రాలును)





అభినవ

# ఉత్తరగోధనాపహారణము.



## —♦ తృతీయాంకము ♦—

### ప్రథమరంగము.

బృ—యీదినంబున నాప్రియురాలయిన పాంచాలిచెప్పిన వాక్యమెట్లు
నిర్వహించనోకదా.

మ. తడయకనేను నాకురుసముద్రమునీదగనాకువచ్చెనే
నీడకగాండివంబునకు నుత్కరశస్త్రశరాళికిఁ మహా
భక్తిశనాచువీరరసవిప్రిషపౌరుష శళమువ్రాల మ
ద్కటకకరోరకల్మష ప్రమాదము బాపినాహ్లాదమొందనే.
నాదుర్మార్గులయిన గురుమాతాపితానుత ద్రోహులయునకతి
నాత్ముంలను.

శా. కరకరశస్త్రరాళిసముదంబున వైరివిరోధిశీర్షముల్
గదరిబరిత్యజించిసురాసురులంత భళీయనంగనా
దుర్మద దుస్ససేన గజికర్ణ వికర్ణవిఘాతవ్రాతలక్ష
నెరపియుకౌరవాబ్ధి గడంగుచుక్రోధములెల్ల బాయగా.
అయినను వుత్తరుడొప్పనో మిన్నకుండునోకదా.

ఉత్తర ప్రవేశము.

ఉత్త—పదివేలవందనములు నాట్యగురూ.

బృ—దీర్ఘాసుమంగళీభవ యుగమ్మా విరాటగర్భాదధీ! అమ్మానగరమున
నందరుక్షేమముగా యున్నవారేనా.

ఉత్త—(కన్నీరుగార్చుచూ) గురుతిలకా క్షేమమేలను.

బృ—అమ్మా! కన్నీరుగార్చెదవేల నీకుసంభవించిన కష్టమును నావలన నయినచో తొలగించెదను. తెల్పుము.

ఉత్త—నృత్యతిలకా నీచేతనవుకార్యమవుచో ఆడినవాక్యక్రమమున హరిహరాదులసాక్షిగా నెరవేర్చెదవా.

బృ—తల్లిసుదేష్ణగర్భకుమారీ! నాద్వారకాసిలయుడగు గోపాలభగవానునిసాక్షి నసత్యమాడువాడనుగాను.

ఉత్త—తండ్రిమమ్మెటు కడతేర్చెదవో (యేడ్చును)

బృ—కుమారీ!యభయంబిచ్చినను కారణమకయకమున్నే దుఃఖంబోధిని మున్గుదువేల. కారణము తెల్పుము.

ఉత్త—సాహిత్యోపద్యాయినీ

శా॥ కురుబలవీరవర్గ సుదసురభుల దోలుకు వెళ్ళుచుండ నా
సోదరుడుత్తరుండు కదనంబుకు బోవ రథంబునడుపగా
సారథిలేనివల్లనిను సంతసమొప్పగదన్ననంబుకున్
రారమ్మనిచెప్పె భూమిజయుడిప్పుడు సారథిగాగనృత్యుడా.

కావున నాయందు శిష్యవాత్సల్యమున్నయెడల యిప్పట్టున నీకార్యము నీభుజస్కందమునుంచి నెరవేర్చవలయును నీవుతప్ప పురమునందు తగుసారథి వెతకిచూచినను కనుపించదు మాయందుపూర్ణానుగ్రహముంచి నావెంటరమ్ము. విరాటసింహాసనము నివిష్ఠాశ్విత కీర్తిదురంధరుడవయి మత్స్యరాజ్యమున నొకవేల్పుగా గొనియాడుచుండగా శాశ్వతకీర్తినాలోచింపుము. (అనిబోధించును).

బృహ—అమ్మావిరాటపుత్రి! నేను పేడినయి నపుంసకుడనయి స్త్రీలకు నృత్యము నేర్పువాడనయినను యోగ్యుడనయి యుద్ధమున్న ట్లు సారథ్యమునకు మేటనని ప్రశంసించుచుంటివి యటయా నావ్యా

దయమునెరిగియు నెరుగనివలె నిటులాడుట చెల్లునే యుత్తరా మరుని బాణజ్వాలా.

ఉత్త—గురువరా! నేనపహాస్యమొనర్చుదాననా తప్పకమీరునామాట లాలించియుత్తరునిచెంతను చనుదెంచి మీరునువారును

చ॥ రణమునకేగుదేననుచు నిన్నటుదెమ్మని దెల్పెనాను ఆ
ర్పణమును జేసియుత్తరునియిచ్ఛయు నీదుహృపితనంబుచే
త, ర్పణజూపి వైరులను నుక్కణగించుటో మరలివచ్చుటో
స్పృష్టణయవును యుత్తరునిపదనంబున కేగుదమో బృహన్నలా.

కాన నా వెంటయుత్తరుచెంతకు చనుదెంచుము.

బృ—అటులనే యుత్తరాదర్శనోల్లాసుడనయి చనుదెంచెదను. (తనలో) ఆహా! నాయనుంగు యర్ధాంగియగుపాంచాలియే యీమ నోల్లానముగావించెనుగదా [సంతోషముతో] ఆహా! పాంచాలి నాయబ్బరపుమరునారీ.

[నిష్క్రమింతురు].

తెరవ్రాలును.

---

—♦ ద్వితీయరంగము. ♦—

[అంతఃపురమున యుత్తరుడు స్త్రీలు]

ఉత్త—ఆహా! దైవరాయా నాచెలియలు యుత్తర యింకను వచ్చుట లేదే కురువీరులు చాలాదూరము నేగియుందురు. అదియునుం గాక.

గీ. సాధయున్న సంగర రంగమందు
వైరులను దునిమించి వీరనామంబుగాంచి
నాదుపిత్రియతండ్రినన్నుబల్ గారవించ
ధేనుగణముల దేశంబుభద్రపఱతు.

[ఉత్తర బృహన్నలప్రవేశము ]

బృ—పదివేలవందనములు. మత్స్యరాజ్యదీప్తివిస్తార కిరీటాధరతనయా!

ఉత్త—బృహన్నలా! ఈయుచితాసన మలంకరింపుము.

(కూర్చుండును)

బృ—విరాటనందనా!

క. నను నిట రావించుటకును
వినఁగోరెద కార్యమిపుడు విభుదేంద్రధరా
కనకాంచితాంకేయూర
మణివాలకిరీటధార రాజకుమారా.

ఉత్త—నాట్యగురూ! నేటిదినంబున మాతండ్రిగారుదక్షగోధనములను సుశర్మ హరింపగా కదనంబునకుజనియుండె. నూరనొకవీరుడైనను లేకచనిరి. యీనయమున, యుత్తరమునయుండు గోధనములను

మ. యుత్తరగోగణంబులను యుర్విని యాకురుసేనలెల్ల
భీతిల్లగ దుర్మదాంధుడగు సుయోధన కర్ణవికర్ణసోమ
దత్తాదిత ద్రోణపుత్రినది పుత్రకృపాదిత కుంభసంభ వా
గ్దత్తముతోడవచ్చిరట సారధిగమ్ము రణావహంబునకుఁ.

కావున నీవీక్షణము సారధిగాతురగముల నరదమునకు గట్టి త్వరితము గాదెమ్ము.

బృ—రాజా! నక్కయెక్కడ నాగలోకమెక్కడయన్నట్లు రణమునకు నన్నుబిలిపించుటయు సారధిగా నియమించుటయు మొదలగు వానితో నన్నటుపరాభవింపమేరగాదు. ఉత్తరా యిటుజేయుట మీబోటులకుసరికాదు.

ఉత్త—బృహన్నలా నిన్నీసమయమున పరాభవించితినా యీసమయ

ము పరాభవానుకూలమయిన సమయమేనా కాననీవట్లుతలంచకుము.

బృ—రాజకుమారా నిజమయినను నాబోటులు సారథియగుట మీబోటులకు నసర్హ్వమయినది కించయయిన పనియయినను నేనుసారథ్యము చేయువారినయినను చూచియుండలేదు.

ఉ. ఉత్తరనాదువాక్యమిను భూవరనందను పేడిమాపినై
యుత్తరియుండజూచియిటులాస్యము జేయగనీకుజెల్లునే నే
మత్తతురంగసంయుత యరథంబునుదోలగనే నెరుంగ
ముస్త్రీదులయిన వీరలిల సారథిపేడియటంచునవ్వగే.
కానేనేనర్హుడను.

ఉత్త—బృహన్నలూ! పేరునకుసారథియున్నావనజాలునా సారద్యమును రథత్వమునేనేనిర్వహించువాడను. మాయందువాత్సల్యముంచి సమ్మతించుము.

బృ—(అనుమానము సూచించి) యుత్తరకుమారా అటులనేవర్తించెదను.

ఉత్త—త్వరగాహయశాలకుజని మేటయగుతురగంబుల నరదమునకు కట్టితెమ్ము వైరులకూపణంచెదను. త్వరితముగాతెమ్ము అనుమానింపకుము. [అటులయొనర్చును.]

ఉ—నాట్యగురూ!

గీ. ఆహవమందున మాయన్నవైరితలలు
దుర్రించ నీవాసముంబున వేగుదెంచ
చనియువారిశిరోవేష్టములనుదెమ్ము
బొమ్మపొత్తియలకు బృహన్నగారూ.

బృ—చిత్తము. (బృహన్నలయుత్తరుడు నారోహింతురు.)

(ఆయుధములను అరమునందుంచి సంసిద్ధుడ ట) సేవకా!

శా. ఆహవమందు వైరులను సుక్కణగించియు గోగణంబులన్
సాహసలీల వెన్కకును జేరగ దోలియు వచ్చుచుండ
నా, హావమున జయము దెల్పగను భేరిమృదంగతురంగ వా
ద్యనా, రోహణయుంచుడి మరలవచ్చెడి వేళకు పట్టణమందునన్
సేవ—చిత్తము. అటుల నేరయొనర్చెదము.

నిష్క్రమింతురు.

(జయజయధ్వనులు).

తెర వాలును.

(తెరలో జనులు)

మత్తకోకిల.

మత్స్యదేశపురాధినాథుని మతియనుంగు సుపుత్రుడ
యిత్స వచ్చినయట్లు జేయుము యిహమునందు త్తారుడ
కురుకులంబుల నెల్ల గెల్చియు గోగణంబులు దెమ్మిక
మరువకను శిరుపాగలును దేమదిని యుల్లాసంబుగ.

తోహార.

విరటుని పుత్రుడ యాక్షణంబున వీరుల నెల్ల హరించి
కురుకుల పౌరుష శాలుర నెల్లను ఘోరముగను మడియించి
గురుసుత భీష్మ ద్రోణ కర్ణ కృప కురువీరుల సృక్కించూ
అమరకనుజన పాలునిచే ఆనందముగావించూ.

ద్విపద.

జయము జయమగుగాక జయ విరటుపుత్ర
జయమగునీకును జయయుత్తరేశ
జయలక్ష్మిగొంచునీ జనములు మెచ్చ
జయహారతులు గొను జననాథచంద్రా.

(ధ్వనులు).



అ భి న వ

# ఉత్తరగోధనాపహరణము.



## —♦ చతుర్థాంకము ♦—

### రణభూమి—ప్రథమరంగము.

[యుత్తరుఁడు బృహన్నలప్రవేశము].

ఉత్త—బృహన్నలా! కనుచూపుమేరన దశయోజనవిస్తీర్ణమయి కనుపట్టుచున్న నాసేనయేమో తెల్పుము.

బృహ—రాజకుమారా యిపుడునునను సంసిద్ధులమయి రణము చేయుటకు వచ్చిరణముజల్పుసేనయె. అది ఆదియేకౌరవాబ్ధి.

ఉ—అటులయిన (భయముతో) నేనొకడనే నీసైన్యసాగరము నీదగలనా నామనంబున నతిభయంకరమయిన భీతిజనించినది. నాయనో బృహన్నలా నేనిల్వనోప.

బృ—యుత్తరకుమారా నాసైన్యముజూచినంతనే భీతిల్లితివి యీసేనతో నెల్లయుద్ధము జేసెదవు అంతఃపురమున స్త్రీలలో ప్రగల్భములు బల్కియిచట నిట్లు బలుకదగునా.

ఉ—నపుంసకవర్యా నాకురుసముద్రమును చూడచూడ నామనంబు పరితాపంబు నొందుచున్నది. రథంబు పురిత్రోవమరల్పుము. ప్రాణముః యున్నయెడల బ్రతుకవచ్చును. నేనిల్వనోపను అదియునుంగాక.

గీ. గుబులు గుబులున గుండెలు బ్రిద్దలగుచు
పాదములువణక దేహంబుపరితమొందె

అందమున నిల్వనోపనో అంబుజాక్ష
జీవమున్నను జనకునిజూడనేర్తు.

బృ—[త్వరగా రథముతోలును].

ఉ—బృహన్నలా ! నా ప్రాణము తీయుట కింతసంతోషమాయెనా నన్ను పురంబునకుజేర్చి మాతండ్రిగారితో చెప్పి నీకుబహుమాన మిప్పించెదను. పురంబుజేర్చుము [బ్రతిమాలును.]

బృ—సుదేష్ణాగర్భకుమారా మరల పురంబునకు నేగుట రాజధర్మంబుగాదు రణరంగము చచ్చినను బ్రతికినను కీర్తియేల లభించును కాని ధర్మవిరుద్ధముచు చేయరాదు.

ఉ—పేడిమూపి నేనిలువనోప నీయురథము తోల్కొనివెళ్ళుము. కురురాజన్యులు వీరరసపౌరుషగాంభీర్యరణధీరులయి నీయొక్క తీట వదిలించెదరు. (రథముదిగి పరువెత్తుచుండును).

బృ—వుత్తరా! వుత్తరా! వుత్తమక్షత్రియకులము కవమానమొనగూర్పకుము నిలువుము. నరునిజూచినజంబుకంబు పగిదిపరువెత్తిన మగతనంబుగాదు మొ* ధీరుడవయి రిపులనెదుర్చుము. [పట్టుకొనును].

ఉ—బృహన్నలా! నేనుయుద్ధముచేయజాలను.

గీ. సేనజూచినయంతనే చిత్తమందు
భయముగల్గుచు నుండెబృహన్ననాకు
యుద్ధరంగమునందునే యుండనోప
నన్నువిడువుము వెళ్ళెదనగరదిశకూ.

కావున పురంబునకు పోయిన నీకుచాలాబహుమాన మొసంగెద. నామాటవినిగమ్ము.

బృ—వుత్తరా! భయమందకుము నీకింతభయమేనీ నీవుసారధివిగమ్ము

నేనుగధికత్వమువహించి కురుసముద్రమును యుద్ధమనునావచే దాఁటెదను.

ఉ—నృత్యనాథా! నీవేనా నీకురుసాగరమును నీదగల్గునది (కోపముతో) నృత్యమనుకుంటివా నాడుటకు.

బృ—రాజపుత్రా! అటులనా యిటువంటికురుసముద్రములు నేను.

గీ. యిట్టియాంబోధులును నేనుదాటినాఁడ
సర్వసాచికి సారథ్యమొనర్చునపుడు
భువిని యర్జునుసమాన భుజబలుండు
వెతకిచూడఁగ మూఁడులోకముల లేఁడు.

అయిన యదృష్టవశమున మీచేనిట్టి అవమానవాక్యములు వినుటకు అజ్ఞులిఖయించె.

ఉ—బృహన్నలా! కోపింపకుము. (తనలో) మున్ను సైరంధ్రి తెల్ప నటులనే యితనుపల్కుచున్నాఁడు. బృహన్నలా అటులయిన రణమునకేగుదము లేకున్నచో.

బృ—వుత్తరా! లేకున్నచోలేదు గీకున్నచోలేదు. నాచేతిలో ఆయుధమున్నచో నీభూతలంబున.

గీ. దేవదేవుండు దేవగణంబుతోను
అజుడుశంభుడు అజుసమూహంబుతోను
సురులతోడను సురరాజువచ్చెనేని
యిందరిని నోపినిన్నురక్షించువాఁడ.

ఉ—నాట్యకులసంభవా! అటులనే సారథివయితిని.

బృ—సుదేష్ణగర్భకుమారా! మనరథమును నాశమీవృక్షముచెంతకు జేర్చుము.

(నిష్క్రమింతురు.)

—♦ ద్వితీయరంగము ♦—

[దుర్యోధన, భీష్మ, ద్రోణ, కర్ణ, యశ్వత్థామలు ప్రవేశింతురు.]

దుర్యో—దేవపుత్రా ! నేటిదినమున యేకొరంతయు ననుభవింపకయే విరటుని గోగణంబులగొనివచ్చితిమి. శంతనపుత్రా! యీకార్య మంతయు మీయొక్కబలమువలనే కదా చేయగల్గితిని. [ఎదుటచూచి]

తాతా! గీ. మత్స్యభూమీశు పుత్రుఁడుమహారణాతి
శాలియయి యుత్తరుఁడశాంతుఁడగుచు
సంగరమున జేరెసారథి పేడిరూపి
గాఁగనాతని గనుగొను గంగపుత్ర.

భీష్మ—దుర్యోధనా! సారథి వికారరూపముగానే యున్నవాడు. భూమింజయుండు హేహ్యామొందక పేడివానినేల సారథిగానియమిం చెనోకదా.

దుర్యో—నదీనందనా! వారిరువురును నేకవృత్తమున శమంతముదాపునకు వెళ్ళుచుండిరి. యేలనోదెల్పుము.

భీష్మ—గాంధారీతనయా ! నాసంగతి మనమెట్లునూహించగలము. (తనలో) నాకురూపిగాయున్న సారథియర్జునుడుగా నాకనుమానముపొడకట్టుచున్నది. పాండవులుమున్ను విరాటపురంబును జేరుటకుముందు వారియాయుధముల నీశమీవృక్షమునయుంచిరికాబోలు. అదిగాకయింతకుముందు యీదుర్యోధనుడు కనుగొనియుండలేదు కాబోలు. ఉత్తరుడు రణభీతుడయి రథంబుడిగ్గిచనుచుండ నాపేడి మరల నాతనిధైర్యచిత్తునిజేసె నీకురుసముద్రము నెదుర్కొన నాయర్జునుడు తప్పనింకొకరివనియే. కావున నాపేడిరూపి యర్జునుడేయగును. శస్త్రాస్త్రములకొరకు జమ్మి

చెట్టుదరిచేరెరి. అయినను బయలుపడ్చకయుందు తప్పక కొన్ని సూచనలచేనూహించ నతడేయర్జునుడు మమ్మాటికిన మ్మోదను మనసునిచ్చిలకేయ మ్యో. ఒకవేళనాతడే విజయుడయిన యజ్ఞాత భంగములేనుకదా (లెక్కించి) (సంతోషముతో) నిన్నటితో పూర్తియయ్యెను.

దుర్యో—(తనలో) నాయుత్తరునితో గూడుకొనియున్న వాడు యర్జును డనినాకుతోచుచున్నది. పాండవులుమరుగుగా మత్స్యనగరంబున వర్తించుచున్నారు గాబోలు. బయల్పడిన భంగములేదా. తాతా! గాంగేయ! పాండవులకజాతభంగముతీరినదా.

భీష్మ—కురురాజా!

క. నిన్నటితోపదమూడేడులు
సన్నుతిగాముగిసె యధికమాసంబులతో
తిన్నగ పాండవులమ్మడు
పన్నగ బయల్వెడలవచ్చి పరమర్షమునర్ల.

దుర్యో—వాహినీగర్భసుకుమారా! ఆయుత్తరుని సారధియగు పేడిరూపి యర్జునుడనితలంచితిని కావున నీయుద్యమమెట్లున్నదో తెల్పుము అదియునుంగాక కాలానారయోచనానుకూలముల నాలోచించ పాండవులు మత్స్యపురమున యున్నారని అనుమానము సూచించుచున్నది.

భీష్మ—కతిజ్యేష్టా! (తనలో మోసమురాదుగదా) నావచ్చెడి నరుడు నిక్కముగా వివృత్యుడేయయి యున్నాడు. నావిజయకంఠీరుడు

గీ. నివురుగప్పిన నహ్నిచందంబుగాను
మేఘమడ్డముదగులు మార్తాండుపగిది
హీనరూపంబు దాల్చినయ్యర్జునుండు
వరలుచున్నాడు యిచ్చటకురుకులేంద్ర.

అటులనే కాకనాసవ్యసాచి నీకురువార్థిని.

గీ. ఘోరవిపినంబునందున వహ్ని వొచ్చి
కాననంతయు అనలంబు జేయునట్లు
మేటిమృగరాజు కరులనుద్రుంచునట్లు
కౌరవాబ్ధికి నావయేనాకిరీటి,

నతనుగాకున్న చో నీమూకలోకొంబుతును ఎదిరింపలదాక
జాలరు.

దుర్యో—(తనలో) భీష్ముడు తెల్పినదేనిశ్చయమయి యుండును సేవకా
యిటురమ్ము. సేవకుడు ప్రవేశించును.

దుర్యో—నీవతిత్వరితముగా జని సమస్తసైన్యంబు నాయుతంబుగాన.
రణభేరి వేయించి ప్రముఖులదోడ్కొనిరమ్ము. [సేవకుడు నిష్క్ర
మించును].

నదీపుత్రా ! నాసందేహముదీర్చుము.

భీష్మ—నీసందేహ మేమి.

దుర్యో—తాతా శంతనపుత్రా ! నాకురూపిపార్థుడని నమ్ముటకునాకు
తగినయాధారములు కనుపించుటలేదు. నతడెవరో తెల్పుము.

భీష్మ—కౌరవేంద్రా ! యిదియా నీసందేహము. నాకురూపియెవరన
తెల్పెదను నిశ్చయముగా నమ్ముము.

సీ. యెవ్వాడు ద్రుపదరాజేంద్రుండు గట్టిన
మత్స్యయంత్రంబును మహినిద్రుంచె
యెవ్వాడు క్రూరులౌకాలకేయులని
గూల్చివసుధాస్థలికీర్తిగాంచె
యెవ్వాడు పాశాత్ముప్రియమున పాశుప
తాస్త్రంబు నీధరయందుబడసె

యెవ్వాఁడు చిత్రసేనుడనుగంధర్వ
నినుగట్టిగొంచియు మడియుజేసె
గీ. యెవఁడు పాండవమధ్యముఁడనఁగ నెగడు
యెవఁడు దశనామములుఁగాంచె వసుధయందు
మేటయవ్వ విజయమార్తాండ సింహుఁడిపుడు
వేగవచ్చెను వాహ్వానరంగమునకు.

(సేవకుఁడు ప్రవేశించును.)

సేవ—రాజా! కురురాజచంద్రా కర్ణ,ద్రోణాశ్వద్థామ, కృపులు వచ్చుచున్నారు. వెనువెంట దుశ్శాసనరాజు రొజుచుపరివెత్తు చున్నాఁడు.

దుర్యో—వారిని శ్వరితముగా దోడ్కొనిరమ్ము.

(ప్రవేశింతురు.)

దుర్యో—ఏమర్యాన్ని పదివేలవందనములు గురువరా.

ద్రోణు—చిరంజీవివయి వర్ధిల్లుమువత్సా.

దుర్యో—గురువరా! యీయుచితాసన మలంకరించుము. అంగరాజా యీయర్ధాసన మలంకరించుము. కృపాశ్వద్ధామ, దుస్యసేను లారా పీఠమలంకరింపుఁడు. [కూర్చుందురు].

భీష్మ—భరద్వాజాంగరాజశ్వద్ధామ కృప దుస్సేననావీరులారా! మీ రందరు కుశలమేకదా.

అందరు—పితామహా! యింతవఱకును కుశలమే.

దుర్యో—వీరపుంగవులారా! అటుబల్కొదరేల.

కర్ణ—మహారాజా! విరాట్రాజమాతనయుండగు భూమింజయుండు రణభూమికిచనుదెంచి భయభ్రాంతచిత్తుఁడై రథంబు దుమికి పురంబు త్రోవకనుగొనిపరుగెత్తుచుండ నతనికి సారథిగాయున్న నపుంసవర్యుఁడొకండు నతనిధైర్యచిత్తునిజేసి. మరలదోడ్కొని

చనుదెంచి తానురథికుడయి రథంబునెచటకో తోలుకొనిపోయె. అతడెవడయి యుండనోపునో కదా.

దుర్యో—అంగభూపతీ! దేవవ్రితుండు నాపేరిడియే. ఫల్గుణుడనియును కాలవశంబున నారూపంబు నాచరించెననియు, దెల్పుచున్నాడు. మున్న దినమ్ము జాలక యుంటి యిపుడు నీవాక్యసహాయమున నిశ్చయముగా మనస్థిరముగా నమ్మితిని.

కర్ణు—రాజా! యేమో నాథనుంజయునకన తత్తరనొందెదవేల. నాపార్థుడయినను గీర్థుడయినను కురుపారావారము దాటుటకు నొకనరునకుసాధ్యమా అందునపార్థుడొంటరిగాయిటువచ్చినా పార్థుడన నమ్మకముజాలకున్నది. నతడెవడో మూర్ఖుని బోలి అందహీనుడయియున్నాడు.

ద్రోణు—[కోపముతో] ఆ! రాధేయా! నాశచీపతిసుతుని నిందజేయుచుంటివా నాపార్థుడేల ఒంటరిగా నిట్లువచ్చెనను చుంటివి. మున్ను సురసాధ్యంబయి నతిఘోరకాఠిన్యగంభీర్య కార్యముల నొక్కడుగా కెందరుండిరి.

కర్ణు—భూసురోత్తమా! అంతటఘనకార్యము లేవోకొంచెము దెల్పుము. మీయొక్క ధూమ్రలొట్టయకంటె గొప్పవేనా.

ద్రోణు—ధూమ్రలొట్టయలాఘవ కార్యములేవా! తెల్పెదవినరా నీచా

సీ. ఒక్కడేకద యింద్రివనము దహించెనట
సమయంబునందున శతసుతుండు
ఒక్కడేకద దుష్టదానవుకాకాల
కేయులగూల్చునాడా కిరీట
ఒక్కడేకద మత్స్యయంత్రము దునుమాడి
మిమ్మందరను నురుమాడునపుడు

ఒక్కడేకద చిత్రసేనుని వంచించి
నినువిడనాడిన సమయమందు
గీ. ఒక్కడేకద సర్గమహాకార్యములను
చక్కజేయుంచునుం దె ఘోరాహవమ్మునందు
అతనిసనిదాకు వీసంతునవనిలేదు
కాలహారిబోలువాడు ధనుంజయుండు.

కర్ణ—భూసురోత్తమా ! పార్థునినెదిరించువారేలేరా. మీబోటులు. నలవాయయిన కురురాజునకు మంచి ధైర్యమును దెచ్చెదరు. కావునమీరందరేల నేనేయావాసవినెదుర్కొందును చూడుము. వైరిస్తుత్యా (కోపము) తనుపరిమాయ చీరలుధరింపుడు.

ద్రో—శూద్రమూఢా! రాధేయా! చీరలుధరించవలయునా ఎంతమించితివిరా. పెదవికిమించిన పల్లునలెనైతివి. (కోపముతో) క్రూరచిత్తా నాపార్థునినెదుర్కొనుట కురుపతితో నాడు డంభాచారములనుకొంటివా.

గీ. క్రూర దుర్మార్గ నీచవో కఠినచిత్త
ఆత్మస్తుత్యాను సాధకర్యానుబూతి
నిన్నుబోలెడి కర్ణవేవేలునయిన
యవనిపార్థుని దాకలహాదుత్తరంబు.
కావున వదరకుము. పెద్దలదూషించకుము.

కర్ణ—నోరీ! భూసురవర్యా ! డంభాచారములుకాదు. వలయునంతకు మిక్కుటముగా గర్వమునంజేర్చెడి బ్రాహ్మణార్థములు. మీరు మొగవీరులుకానిచో వెనుకకువెళ్ళుడు. యిటనెవరిని మందలింపకుడు. మందలించినచో.

అశ్వ—ఓరి! కులద్రోహి! నాతండ్రినవమానించునంతట ధనుర్వేదివా. సురాసుర యక్ష కిన్నర గంధర్వ సిద్ధ సాధ్యకింపురుషాదు

లయినను. నాలోకఖ్యాతుఁడగు నాతండ్రిభారద్వాజునిగేలిసేయ
వు. జాగ్రత.

కర్ణ—ఓరి! ఆత్మస్తుత్యా మీాదేశమునన్న్యేమః మిమ్ముమించువారీ మూ
ఁడులోకంబులను లేరనిమీాయూహచే మూఢులయొద్ద పొగడు
చుందురు. అట్టుల నీ పురుషులయొద్ద చెల్లునా.

అశ్వ—ఆత్మశ్లాఘపరాయణా! నీవిట్లువృథాప్రసంగములాడిన నిన్నీకర
వాలమున ఖండించెదను.

కర్ణ—ఓరి మూఢుడా! నీవేనన్నుకరవాలమున ఖండించిన సూర్యనంద
నుడనయి ఉత్తమక్షత్రియుడనయి కురువంశ స్నేహితుండయిన
యాకర్ణుని రక్షించవాలును నీకంటెయనాథయనుకుంటివా.

అశ్వ—ఓరి నరపశువా! నేనుమూఢుడను అనాథనా నాయనాథత్వ
ముచూడుము. (కత్తిదూసినరుకబోవును.)

కర్ణ—ఓరిపరమమూఢా! నేనేనరపశువునా (నరుకబోవును).

దుర్యో—అంగరాజా! శాంతింపుము. మీాబోటులకీ సమయమున నిటు
వంటివైరముకూడదు. (అని పట్టుకొనును.)

కృపు—వత్సా! ఆచార్యతనయా! యిది సమయముగాదు నామాట
విని శాంతింపుము. (పట్టుకొని) చెవులో నేమో చెప్పును).

---

—♦ తృ తీ య రం గ ము ♦—

[జమ్మిచెట్టు ఉత్తరబృహన్నల ప్రవేశము.]

బృ—ఉత్తరా! ఆయుధముల తెమ్ము. సైన్యము మనవైపునకు చనుదెం
చుచున్నది.

ఉ—బృహన్నలా! ఆయుధము తెచ్చుటనుండ నైకొనదలచితివో దె
ల్పుము.

బృ—విరాటపుత్రా! మున్ను పాండవులు అజ్ఞాతముజల్పచనెడి సమయ

మున వారివారి ఆయుధముల నీశమీకమునందుంచిరి కాన నీ వీచెట్టెక్కి నాయాయుధముల తెమ్మా.

ఉ—[చెట్టునెక్కి] (శవముల కట్టియుండజూచి) బృహన్నాలనీచెట్టుపయి శరములుగాక మనుష్యకళేబరములున్నవి. భయమందితినని చులకనగాచూడ పాడియా.

బృ—యుత్తరకుమారా! అవి శవములుకాదు. ధర్మజునువారియొక్క దేవతాశరముల నెవరయినను నపహరింతురని నట్లు శవములనుంచెను. కాన శరములతీయుము.

ఉ—[శవముల దీయశరములు, సర్పములై వచ్చుచుండ] నపుంసవర్యా! సర్పములుయున్నవి. నారాజ్యమునందుండి నాహారము నొక్కుచు యింతదుర్మార్గమున కొడిగట్టితివా.

బృ—సుధేష్ణగర్భచంద్రా! శవసర్పములుకావు. ధర్మరాజు శాపకారణమున నట్లు కనుపించుచున్నవి. ధర్మజుని మదిదలంచుము.

ఉ—(మదిదలచి) బాణములతీసి (తనలో) ఆహా పాండవవీరులాలా మీబాణమునెంత ప్రతాపమయియుండ మీరెంతశూరులోకదా మిముజూచుభాగ్యమెన్నడోకదా [బృహన్నలవైపుచూచి] నాట్యగురూ వీరశూర ప్రతాపపౌరుషశాలురగు కుంతీసుతులు యీయాయుధముల నేదినెవరుధరింతురో చెప్పగలవా. అయిన నది నీవెట్లుగాంచితివో సాంగముగా దెల్పుము.

బృ—మత్స్యభూపాలగర్భసుకుమారా! నాకుతెలిసినవరకు తెల్పెదను. వినుము. మున్ను (శరముల చూపించుచూ).

సీ. యీనిశాత్రంబు యమతనూజుడబట్టు
గనుగొనుసీవువిరాటపుత్ర
కేసరిసుతుబట్టుగద యిదేగనుగొను
యొరులుబట్ట నసాధ్యమగునుదీని

వాసవసుతుడీ గాండీవంబును ధరియించు

కరులకునిది సర్మమగును

మాద్రినందనులు యీశరములు ధరియించ

గన నసాధ్యంబగు మత్స్యతనయ

గీ. వారిబాణాసనంబులు వదిలివారు

భువిని నజ్ఞాతసుఖ మనుభవించుకొఱకు

వెడలునపుడిందు వారి దివ్యాయుధములు

పెట్టుటను నేనుగంటి నుత్తరకుమార.

తదుపరి వారుమమ్ము విడచి యెటునడచిరో తెలియరాదు. తదుపరి మేము మీయొక్క ఆశ్రమములకు చనుదెంచ మీతండ్రి యగు మత్స్యధరానాథుండు.

గీ. వారికొసగెడి వృత్తులవారికొసగి

ధర్మజుని బోలివిరటధరాధిపుండు

కన్నబిడ్డలవలె మమ్ముగాచుచుండ

కష్టమెరుగకయుంటిమి కరుణసాంద్రి.

ఉ—(అనుమానించి) నాట్యపండితా! మిమ్ము విడచిచనిన యాపాండు రాజనందనులును మామేనత్తయగు కుంతీగర్భసుకుమారులు నయిన నాపాండుకులాభరణు లెచటకేగిరో మరియువారెచట నున్నారోకదా. [వ్రికాశముగా] విద్యనాథా! బృహన్నలా!

గీ. కౌరవేంద్రునివలన కష్టంబునొంది

ద్వాదశాబ్దము లరణ్యమందు దిరిగి

పూనియజ్ఞాతమును ఇల్వభూమియందు

ప్రాణములతోటి యున్నార పాండుసుతులు.

బృ—జననాథకుమారా! నా పాండురాజనందనులు బ్రతికియేయున్నా

రు. ఆవీరవిక్రములయిన కౌంతేయు శ్రీకృష్ణసహాయులయి
యుండ నిర్భవులగుదురా.

ఉ—నాట్యపండితా! అటులయిన నాజగదేక శూరులయిన-

గీ. పాండురాజ మహీపతిపుత్రవరులు
యమతనూభవ వాయునందనకిరీట
నకులసహదేవ పాంచాలి సహితముగను
యచటనున్నారు ధరణిలోకనుగొనంగ.

నీవు దివ్యజ్ఞానసంభూతుడవుటవలన నిన్నడిగితిని తప్పక తెలిసి
యున్నయెడల ద్వారకానాధుని యానగా నిజమునుదెల్పుము.
(త్వరపడు నట్లభినయించును.)

బృ—[తనలో] ఆహాయితడు తనయూఖ్యశృంకములచే నన్నుబంధించి
వైచెను. యికచెప్పకతప్పదు. [ప్రకాశముగా] సుధేష్ణగర్భను
కుమారా!

క. మనపురమున వారందరు
ఘనముగ మారువేషములతో కపటముతోడన్
అనయము వర్తించుచుందురు
మనమున సంశయముమాను మహీపతిపుత్రా.

ఉ—[ఆశ్చర్యముగా] ఆహా! మననగరంబుననే యున్నవారా (ఆలో
చించి) బృహన్నలారిత్తవాక్యముల బల్కెదవేల. నావైరిశూల
ములయిన కుంతీతనయులున్నయెడల కంటికి కనబడకుందురా.
లేక మారురూపములు ధరియించిరా బృహన్నలా! ఆశ్చర్యము
గాబల్కెదవు. నీవాక్యములుతప్పక యన్నియు రిత్తగా తోచు
చున్నది.

బృ—భూమింజయా! అసత్యమయిన ప్రసంగమును నేనెన్నడునుచేయు
వాడనుగాను సుమా. తప్పక మనపురంబున వారలు [తనలో

బయలువెడలిన మోసము లేదుకదా] (ప్రకాశముగా) మారు వేషములతోనె వర్తించుచున్నారు. వారినిశనుగొనుటకు వారి పాదకమల సంభవులయినను చాలరు. వారెటులు వర్తించు చున్నారన.

సీ. కంకుభట్టనుపేర వైకుంఠచరితముల్
తెల్పెడివాడె సంయమినుతుండు
వలలాంకుడనుపేర వంటలుజేయుచు
సింహబలునిద్రుంచె వృకోదరుండు
హయశిక్షకునిపేర హయసాధనముజేయు
చున్నవాడే మాద్రిజ్యేష్టసుతుడు
గోగణంబులమేపి గోపాలుడనదగు
తంత్రిపాలుడె హాయదేవసుతుడు
గీ. చెలగిమాలిని యనునామె దుపదరాజ
పుత్రి పవనజతోగూడి పురమునందు
వరులుగనుగొందురో యనుభయముచేత
వరలుచున్నట్టి వారలువరగుణాఢ్య.

ఉ—[ఆశ్చర్యముగా] ఆహా! యేమీయాచిత్రము (సంతోషముతో) పాండవులు మనపురంబుననే యున్నారా. దైవరాయా! వారిని చూచుభాగ్యమెన్నాళ్ళకుగల్గె. ఇపుడు నాసంతోషమునకు మేరయేలేదు. హా! పాండ కులాభరణులారా! మీకెన్నియిడు ములు ప్రాప్తమయ్యెనోగదా. [చింతించుచూ]. హా! అర్జునా పుణ్యపురుషా నాట్యపతి యీపుణ్యముగట్టుకొనుము. నాప్రా ణములరక్షించుము.

బృ—మత్స్యనాథాత్మజా! అంతఘోరమవు యిడుములేవో చెల్పుము బాపెదను.

ఉ— బృహన్నగారూ !

గీ. అందరున్నారు యనితెల్పినావుయిపుడు
పార్థుడెందున్నవాడు నపుంసకర్య
మనమునందున సందేహముడిచి నిజము
చెప్పమాతనిజాడలు మ్రొక్కువాడ. (పాదములపయిబడును)

బృ—[అనుమానించును.]

ఉ—అనుమానించెదవేల. యీశుభవార్తదెలిపి నందులకు యీహార ముసు బహుమతిగా గొనుము. (మెడలోవైచి) నాదశనామా న్యుడెచ్చటనున్నాడో తెల్పుము.

బృ—[తనలో చల్లనువచ్చియుంతదాచనేల. చెప్పకతప్పదు.] భూనా ధతనయా!

గీ. నేనేపార్థుండగనుగొను నిశ్చయముగ
మున్నుపూర్వశి నొసగిన శాపమునను
యిటులనైతిని భంగంబునొందనీక
నాదువాక్యంబు నమ్ముమనరనాధతనయా.

ఉ—[అనుమానముగా] పేడిరూపిడం బాచారములు తెల్పిననమ్మదుర నుకొంటినా. గంగలోమునిగినయంతల కాకి హంసయవునా. నీవే విజయుడన నెవరునమ్మెదరు. పుదకూద్రిమండిబయలు వెడలు. దివాకరుబోలు విజయుడనేన నమ్మజాల.

బృ—(నిజరూపము దాల్చును.)

ఉ—(పాదములపై నొఱగి) వాసనందనా ! యీదీనుని గాపాడుము. తప్పులన్నియు క్షమించుము.

గీ. వందనంబిదె పాండువంశాబ్ధిచంద్ర
వందనంబిదె వాసవనందనుండ

వందనంబిదె వసుదేవపుత్ర సఖుడ
వందనము పార్థయిదే గొను వందనంబు.

అర్జు—వత్సా! పరిజావాలతనయా భయమందకుము యీకౌరవా రాం తారముల యగ్నియనెడి నా బాణజ్వాలలతో నశింపజేసెదను

ఉ—అమ్మయ్యా బ్రతికితిని దిగులుదీరినది. యికను కౌరవులైనను మూాడుభువనములయినను నొకటియేకదా. [పరికాశముగా] పాండుకులాభరణా! యీ అధముని రక్షించు భారమునీదియే. [వణకుచును.]

అర్జు—ఉత్తరా! యిదిగో యభయహస్తము గొనుము. (యిచ్చును) శరములుతీసికొని రథారోహణజేసిన మహిపతిపుత్రా గోగణంబులు వెడలుచున్నవి వేగముగా రథంబును రణభూమిజేర్చుము.

ఉ—శతనూనా! చిత్తానుసారముగా వర్తించెదను. (రథముతోలును).

[నిష్క్రమింతురు].

తెరవ్రాలును.



శ్రీ

అ భి న వ

# ఉత్తరగోధనాపహరణము.



## —పంచమాంకము—

రణభూమి

(భీష్మద్రోణులు—ప్రవేశము)

భీష్మ—ఆచార్యా! నావీరసింహుడగు విజయుజూచుభాగ్యము నేడుగదా లభించినది నీకురుసముద్రమునునతను దాటుటకు సందియములేదు. నీదుర్మార్గవర్తనుల నుదుట చతుర్ముఖుడటులిఖియించెగాబోలు—(తనలో)

శా. చింతలు నొందగావలసె నేనమహాగ్రధికత్యమంబునన్
వింతయుగానిజెుదియిటు కాటనెరుంగక హారవశమునన్
వింతలు క్రొత్త క్రొత్త వికారప్రయోగము ఘోరమయ్యె
కౌంతేయుల కెంతకష్టదశ కాలముగూడెను ద్వారకాధరా
హా పాండునరనాధ తనయులారా మీకెంతకష్టదశనొనగూడెను

గీ. పాండురాజమహీధవు పుత్రులయ్యు
నాదు చేతులలో గారవమున బెంచి
నట్టిపాండవులెట్టి యనాధలయిరి
వారికిటు లవ్వుట యెరుగను వారిజాక్ష.

(అను వెనుకటిపద్యమును చమవును)

ద్రోణు—దేవపుత్రా! సత్యగుణములన్నియు నావీరకంఠీరవునకుచెల్లును. నేటిదినంబున నాపార్థుని చూడచూడ ప్రళయకాలరుద్రుడో

యనఁ భీతిజనించుచున్నది. నేటిరూపంబును సరియగు గాంభీర్య మిదివరకెన్నఁడును గలిగియుండలేదు.

సీ. దండివారలు కాలకేయులధరఁగూల్చు
నపుడయిన నిట్టిరౌద్రంబులేదు.
ఖాండవంబేర్చి గాండీవంబు గొనునపు
డయిన నీరుద్రరూపంబులేదు
వనితకోసము కర్ణుడని నేయునప్పు
డయినను నిట్టిప్రళయంబునరయలేదు.
ద్యూజ్ఞ నేనునిసభఁ గీడ్వించిన వలువలు
వల్వించునపుడిట్టి రూపులేదు
గీ. ప్రళయ కాలపు రుద్రుని భంగిబోలి
రణమునకువచ్చె పాండవ రణవిభుండు
యిపుడరూపంబు జూడ నాకిఁజయునకును
వృద్ధిసిద్ధించె నామమివ్వేళ్చెడనగ

ఆహా! ప్రళయ కాలుఁడోయన గణముజేరెను.

భీష్మ—కుంభసంభవా! నావచ్చి కిరీటయటులు గుర్తించింవానిబోలియుండని సైన్యంబున కేలనో యపశకునములు తోఁచుచున్నవి. దుర్మార్గానువర్తనులకు నెట్లు శుభములు చేకూరును. భారద్వాజా!

ఉ. కురుకులసేనప్రక్కలను కూయగ సాగెను జంబుకంబులుఁ
గిరికళదప్పి శైలములు క్షితితల మెల్లను కంపమెత్తియుఁ
భీరములేకయుండె నతిభీగము గల్గిననేనకంతయుఁ
సమరము నెట్టులో యిపుడువచ్చెడి ఫల్గుణు సమరకీర్తికిఁ

ద్రోణు—శంతనవంశవర్యా! మీవాక్యములు వృథాకావు. నిశ్చయము ఆపజయముచేకూరునను తెల్పునటుల నపసూచకములగు

చున్నవి. (ఎదుటజూచి) అదుగో నావిజయకేసరి యిటులనే వచ్చుచున్నాడు.

(ఉత్తరార్జునుల ప్రవేశము).

అర్జు—తాతా కురుకులపితామహా! గంగాగర్భోద్భవా!

గీ. వందనంబిదె గాంగేయ సుకుమారవర్య
వందనంబిదె బ్రహ్మచారిత్వనీకు
వందనంబిదె శంతనువంశవర్ధ
వందనంబిదె గైకొనువార్ధితనయా.

భీష్మ—వత్సా! అర్జునా చిరంజీవినయి వర్ధిల్లుము.

అర్జు—(ద్రోణుని కడకరిగి)

క. వందనము కుంభసంభవ
వందనమిదె విద్యనాథ వందనముగురూ
వందనము భూసురోత్తమ
వందనమిదె ద్రోణాచార్యధర్మనివార్యా.

ద్రోణు—శిష్యా! జంభభేదినందనా! చిరంజీవి విజయుసౌభాగ్య శ్రీయ స్కారసంతతతో వర్ధిల్లుము. (సంతోషముగా) ధనుంజయ యన్నిదినంబులకు మిమ్ముగాంచగల్గె. నీద్వాదశాబ్దములెన్ని కడరాని యిడుముల గుడచితిరోకదా [వూరకుండి] నాభాగ్యము

భీష్మ—బిడ్డా! పాండవవంశచంద్రా ! మేమాకురునాధ యాహారవశుల మగుటచే మీయవస్థలను చూడవలసె. నాపాపిదైవమెచ్చట గలడోకదా. మీరుగడచిన అరణ్యాజ్ఞాతములలో మిమ్ము జూచుకోరికవలన నయనపతులుగల్గె. అయినను నేటికినా భాగ్యవశమున కనులారగాంచితి. అజ్ఞాతమున నెట్టికష్ట మనుభవించిరో కదా. చేతులారపెంచి పెద్దవారలజేసిన నేనేమరలమీయిక్కట్టు లచూడగల్గె. మీరుదైవబలమున సుఖంచెదరుగాక.

అర్జు—పితామహా! అజునివాశ్రితను తప్పించగలరా. యేదియెటుల జరుగనున్నదో యటులనే జరుగుచుండును. అందు మనప్రయత్నమేమియు లేదు. మాయందుమీకుగల దయారసమెరుంగుదును. అయినను నడికొనసాగుట లేదుగదా. యెవరేమి యొసర్చిగి సెలవొసంగుము.

ద్రోణు భీష్మ—వత్సా! మీయందు భగవానుడగు ద్వారకానగరాధీశుడు శ్రీకృష్ణుడు.

ఉ. భగవానుండగు ద్వారకాభవనధీశుండయిన శ్రీకృష్ణుడుర్
సాక్షాత్కారంబయి మీకునెల్లపుడు యుండున్‌గాన విజయంబు
చేకూరుర్ కౌరవయోధులర్ దునిమిరాజ్యంబంతనాధర్మ
రాకొమరుండేలును సుఖము చేకురునువత్సాపోయిరమ్మాయికర్
అట్టియైశ్వర్యము యనుభవింతురుగాక.

(అర్జునుడు నిష్క్రమించును).

ద్రోణు—అబ్దిసుతా!

క. మరియాద యనెడివస్తువు
దరిజేరెను పాండునందదీరులవళమై
హారి వారిచెంతనుండెను
దురమున విజయంబుగూడు ద్రుపదాత్మజలకున్.

మరియాదయను భాగ్యము పాండుకుమారుల యందుగాక నింకెవరికిని తగదు ఆహా! నావిజయునియొక్క మానాభిమానములు వర్ణించతరమా! [తెరవ్రాలును]

ఉ—నందనందనమిత్రా! యిపుడుమీకు నమస్కరించి శుభదీవనలంది సంభాషించిన వృద్ధాప్యులెవరోకదా అందునాబ్రహ్మచారియవరు నాభూసురోత్తమ చంద్రుడెవడోవినగోరెద సెలవొసంగుము

అర్జు—(భీష్మునివంకజూపి) మత్స్యయువపతీ!

గీ. అతడెభీష్ముండు వాహినీవరసుతుండు
శంతనుని గర్జమంతుడు శౌర్యఘనుడు
అతనిదాకట మనకుసాధ్యమగును
సేనమధ్యకు నరథంబుచేరనిమ్ము.

[ద్రోణునిజూపి] యీభూసురతిలకుడు.

గీ. ద్రోణుడాతడేచూడు ధనుర్వేదివృద్ధి
నాదువిలువిద్య నేర్పునాధుడతడె
[అశ్వత్థామనుజూపి] నతనిపుత్రుడు నశ్వత్థామయతడె
వారిచెంతకు రథ్యంబువలదువత్స.

నాద్రోణుని ప్రక్కనిలువబడియున్న ఉత్తముడు.

గీ. ద్రోణునంతట వాడస్త్రవిద్యయందు
ద్రోణుడాతని మేనమామయగును
[దుర్యోధనునిజూపి] పట్టభద్రుండు యితడెదుర్యోధనుండు
వారిదరిజేర నీకు విరాటతనయా.

(కర్ణునిజూపి) ఆశరధారుడయి యున్నశూరుండు

చ. కర్ణువాడెమాకు గన నగ్రజుడాతడు కుంతియందు
భానునకు జనించిభార్గవుని సమ్మతిచేతనువిద్యనొంది ప
ల్గునకు నీపుతప్ప ప్రతివీరుడు యవ్వడులేడటంచు నా
జనపతిచేత నెల్లపుడు పెంపుడలిర్పుచు నుండునుత్తరా.

కావున నాయినపుత్రునకు సమీపముగా మనరథంబుతోలుము.
పిదప మాయిరువురితారతమ్యములను పరీక్షించుచుము.

ఉ—(రథము తోలును).

(కర్ణుడు పరివేశముగా దరిజేరును.)

కర్ణు—పురుహూతతనయా! మనుజన్మనుగొని వెడలు జంభారికంబు

వలెననుజూచి అటుపోవుటయేల నీకువిరోధియు కురురాజు కుడిభుజమునయిన భానునందనుడిచట లేడనుకుంటివా

అర్జు—ఓరేకర్ణ! నేనటుచేయలేదుసుమా నిన్నెదిర్చ చలయునని యే తేరు నిటుదోలనియమించితిని యింతకామున్ను నీవురాలేదని యేయను కొనుచుంటిని నాభాగ్యవశమున నిటకేచనుదెంచితివిలెమ్ము.

కర్ణ—ఓరీ అర్జునా! నేనురాలేనని యేతలచుచుంటివా నీతలంపువల ననే నీవలలో నీశూరయుగు మార్తాండయా స్తంనుచనుదెంచె. నేనువచ్చిన రణమున జయించి కురురాజునవమానించెద ననుకుం టివా. సరి సరి.

అర్జు—సంహారింతమని యనియా యనిపలుక నీకెట్లు మానాభి మాన ములు లేకయుండెను నీవు కుంతియందు భానునకు జన్మించి మాకు సోదరుడవయి విరోధియందు జేరి మమ్ముల యిడరా నియిడుముల గుడిపి మరల నెదిర్చి చనుదెంచితివిరా దుర్మా ర్గా నిన్ని కరవాలమున ఖండించినను దోషము సంభవింపదు నీచా.

కర్ణ—(తనలో)ఆహా దైవమా! నీవిజయుని గాంభీర్య వాక్యములచే నామనసు కరుణాసముద్రమయి పాండవులయందు చేరినది (శంకించి)మున్ను కురురాజుతో అర్జునుని జయించుట నేనున్నా నని నతనినమ్మించితిని యిపుడు సోదరాభావమునకంటె నమ్మి నవారిని చెరుచుటవిశ్వద్రోషము అయినను మనసా త్వరజెందకు ము ప్రాణమువిడిచినను నమ్మినవారిని చెరుచుట నీచము పాం డవులయెడజేరి కౌరవులచే స్వర్గస్థుడనయిన చో దుర్మార్గుడగు కర్ణుడుద్రోహియని జనులాడుచుందురు యేమయిననుగాక కౌర వుల విడుచుపాడనుగాను (ప్రకాశముగా) విజయా రణమున

ఉత్తమ క్షత్రియుడవయిన నీవీశ్రీరంగనీతులు బల్కు పాడిగాదు సమదృష్టినిలచి యుద్ధము చేయుము.

అర్జు—ఓరీ! కర్ణా శ్రీరంగనీతులుగాదుసుమా నీవలన మాకుజనించు దుండగములు అంమనరౌద్రముచే నిటులాడితిని.

కర్ణు—అర్జునా! మానాభిమానములు తెలియక యిటుబల్కు మేరయే నా. నావలన మీకు సంభవించిన విచారములేవియో దెల్పు ము. వృధాప్రసంగమేమి లాభము.

అర్జు—దుర్మార్గా రాధేయా! వృధాప్రసంగములా నీవలనమాకు గలిగి నదుండగములేవన వినుము.

సీ. యొంటరిగా హరిపుత్రుతో కపట
జూదంబాడి రాజ్యమపహరించుటెల్ల
కాలకోటవిషంబు వాయుసుతునికొసంగి
జలములలోబడ ద్రోయుటెల్ల
మముజంపగానెంచి మంచితనంబున
లక్కాగృహము గాల్పించుటెల్ల
వనితయనితలచక వహ్నిపుత్రినిసభ
కీడ్పించివల్వలొల్పించుటెల్ల
గీ. నీవుకురురాజుతో గూడుకతనగాదె
మాకుపడరాని బాధలుప్రాప్తమవుట
యుద్ధరంగమునందు రాధేయనిన్ను
దునుమువాడను దుర్మార్గ నీచవర్తి.

కర్ణు—అర్జునా! యిటువంటి వృధాప్రసంగములేని ఆయుధములు చేబూని కదనమునకురమ్ము.

అర్జు—(శరములుబూని) కర్ణా! యీశరముగాచుకొనుము. (తనలో)

గీ. పాండుమతిపతి వంశవర్ధనుడనేని
కుంతియందు శతమేధు కుదయించుతునేని
ధర్మమును దప్పకను ధరావరలు దేని
శస్త్రరాజంబు కర్ణునిమూర్ఛబుచ్చు. [శరము విడచును.]

కర్ణు—హా! తండ్రి! పరిభాకరా! (మూర్ఛిల్లును).

అర్జు—ఉత్తరా! మన తేరటు జననిమ్ము. (రథముపోవును.)

(దుస్సనేనుడు ప్రవేశము)

అర్జు—ఓరీ దుస్సాసనా! నీవు రాలేదని యనుకొనుచుంటి కదనమునకు రమ్ము.

దుస్స—(తనలో) హా దైవమా! చేటుకాలము చేకూరెనుకాబోలు లేకయున్నచో కిరీట యిచ్చటయున్నాడనినచో నిటకు వస్తునా యిపుడు నాగతి

గీ. మిడుత కానకచిచ్చును జొచ్చునట్లు
వ్యాఘ్రరాజంబు బోనునుజొచ్చినట్లు
రాజీవాక్షుడు రాక్షసుబూనినట్లు
విజయుకంటను బడుట నావిధికృతంబు

అయినను ధైర్యమిడరాదు (ప్రకాశముగా) ఫల్గుణా! నన్నెదుర్చుము.

అర్జు—(మోహనాస్త్రముచే బంధించి) ఓరీ మదాంధ! దుస్ససేన నీవొవర్చు నీచకార్యమునచో నిన్ను

దుస్స—అర్జునా అన్నయ్యా కోపముడిగి యటువంటి పరాభవ మేమియో తెల్పి తదుపరి శిక్షించుము తమ్ముడనుగదా.

అర్జు—ఒరీ దుర్మార్గ తమ్ముడవా నీచకార్యమని శిక్ష దిగనాడి పదియందిజనములో విగతవస్త్రుడవయితివి.

గీ. పిన్నతండ్రి కుమారుల భార్యయనియు
తలచకను యాజ్ఞసేనుని రాజసభకు
నీసాధ్వి భంగమొనర్చిన దుష్టఖాండ
నాదుశరవేడి బూచుమీ దుస్ససేన.

(గొంతుక కోయ నుంకించి) (తనలో) ఆహా ! యంతమోసము
భీమప్రతిజ్ఞకు భంగముజరుగును ఒరే నరపశువాదుస్సాసనా

గీ. దుస్ససేనని రుధిరంబు గ్రోలుదనుచు
వాయినందను డయిన వృకోదరుండు
ప్రతిన భంగంబు వచ్చునను భయముచేత
కౌరవపురి జేరుటకు వీలుమనియె భువిని.

(విడుచుపెట్టును)

దుస్సా—(నిష్క్రమించుచూ తనలో) అమ్మయ్యా బ్రతికితిని. వంట యిల్లుజొచ్చి నరణ్యవాసిపగిది విజయుని కంటబడితిని. చావుసిద్ధమాయెన్యొ. భీమునిప్రతిజ్ఞ నన్నురక్షించెనుగదా. నావృకోదరుండె నాపాలిదైవము. ఆతను నన్నెపుడో సంహరించును లేకచో యిప్పుడే పార్థుడు మడియించుచుండె నావాయునందనుని దయవలన బ్రతికితిని. యికబోమెదను లేనిచో ముప్పువాటిల్లును.

(నిష్క్రమించును).

అర్జు—యుద్ధమున సైన్యము నురుమాడుచూ [తనలో]

శా. కౌరవసేనయెల్ల త్రిజగంబులు మెచ్చగమ్రిందజేసితిగా
వీరిని నాదుశాణములతోడను నిప్పుడు మ్రిందజేసినగా
భారతయుద్ధమందునను బాణము తుప్పవదల్చి నేను
పారాడగ వీరులెవ్వరును లేకనుయుందు రణావ్యానంబునన్

అయినను గీ. యిటులయుద్ధంబు జేయనాలస్యమగును
ధేనువలువెళ్ళుచున్న విదోర్భలముగ

మోహనాస్త్రంబు సంధించిమూకలన్ని
నిమఃథరమీద జెందుపల్లెనొనప్త.

[శరమువిడుచును] మూర్ఛనొందుదురు.

భీష్మ—ఆహా ! యర్జునుండు మొనననంతయు మూర్ఛమునుంగజేసె. నేనునాయస్త్రదిగ్విజయము నెరిగినవాడనగుటచే నన్నంటరాకున్నది. ఆహా! యేమీనావిజయుని బలవిక్రమంబులు నాతని గుణంబులకు సరిపోలియున్నవి. (అయ్యోడికార్యము నిల్వదు గదా).

అర్జ—వత్సా విరాటనందనా !

గీ. మోహనాస్త్రంబుచేతను మూర్ఛబుచ్చి
తిపుడు నీవేగబోయి నీచెలియలయిన
విరటుపుత్రికచెప్పినయట్లు వారి
శిరోవస్త్రంబులనుదెమ్ము శీఘ్రగతిని.

అయినను నీవు

గీ. అవనిలోగాంగేయునొద్దకు యస్త్రమిపుడు
చనగనేరదు చనిననాశంతనుండు
భార్గవేశునినేర్పిన ప్రతిరయొనర్చు
భీష్మునొద్దకుచనకు భూపాలతనయ.

ఉత్త—చిత్తము. చిత్తానుసారముగా వర్తించెదను. (తెరలో) ఆహా ! పాండవక్షీరాబ్ధివర్ధనా!

గీ. కౌరవాపారవంబు దాటుటకును
వాసవానందనుడను నావతప్ప
వేరధీరుడుదాటగా నేర్చునేడ
విజయు సాక్షాత్ రమేశుడై యుద్భవించె.

లేకున్నచో నీప్రపంచము కురువార్ధిని నీదువారులేరు. నిశ్చయము. నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయము. (తలపాగలను చించుకొనివచ్చును).

అర్జు—భూమింజయా! శిరోవేష్టములను కొనివచ్చితివా.

ఉ—వాసుదేవ మిత్రసంభూత !

క. కౌరవ రథికులఖగు
శిరోవేష్టములఁ దెచ్చినాఁడవేగనుయిప్పుడే
సురభులదోల్కొని పురముకు
కరమరుదుగ దరలవలెను కంఠిరబలా.

మందగోపాబులారా! మొదవులను మందలించి పురముజేర్చుడు.

గోపా—[అటుల యొనర్చుదురు.]

బృ—యుత్తరా ! నీవు రథికుడవుగమ్ము. నేనుసారథిగా యుండెదను.
[బృహన్నలరూపము దాల్చును].

ఉత్త—పాండుకులాభరణా! యిదేటియన్యాయము. [వచ్చును]

బృ—మత్స్యభూపాలపుత్రా! యిపుడే బయల్పరచకము. విరాటునితో నీవే కురుబలంబుల జయించితటు దెల్పుము. మేము రేపటిదినమున బయల్పడుదుము. అంతవరకును మరుగుగానుంచుము.

గీ. రేపు వుదయము రాజయాస్థానమునను
బయలుపడుదుము మేముభూమింజయుండ
నీవెయాకురుసేన నురుమాడినటుల
తెల్పుమహీపతితోడ యుత్తరకుమార.

హిమగిరివాసునితోడుగా నింతకంటె తెల్పకుము.

ఉత్త—చిత్తము. అటులనేవకాంక్షింతును.

బృ—ఉత్తరా ! పురంబుజేరుదము. ఆలస్యమేల. [రథమునడుచును. పురసమీపముజేరి నేపథ్యా]

సే—స్వామీ! దేవరయాజ్ఞనుల్లసించఁగోరెద.

ఉత్త—నీవీ క్షణంబున నగరమునకు చనుదెంచి మాతండ్రిగారితో

చ. కురుకుల పారవారమును కూలఁగఁద్రుంచి భూమింజయుండు నీ
పురమును జేరవచ్చె నత నెదుర్కొన వలయును గీతవాద్య నృ
త్యాదివి గరిష్ఠనెల్లరును వారిసనుల్ నతి యింపు సొంపుగా
జరిగి సమర్ధతంబుగను రమ్మను వైభవ యుత్సవంబునన్.

సే—చిత్తము. మిమునెదుర్కొందును (నిష్క్రమించును)

---

—♦ పంచమరంగము ♦—

(సైన్యము మూర్ఛనుండి లేచును.)

భీష్మ—(తనలో) కుక్కకాటుకు చెప్పుదెబ్బయన్నట్లుయున్నది.

దుర్యో—పితామహా హిమతనయపుత్రా! నాపార్థుని వీరవిక్రమములు దుర్లభములు. లేనిచో వారధిబోలు సైన్యంబును కరులపయిబడు కంఠీరవునివగిది సుంతకష్టంబులేక జయించి కామధేనువుల మరల్చినాడు. భారతయుద్ధమునం దెటు జరుగునో కార్యక్రమము తెలియదు.

భీష్మ—కౌరవేశ్వరా! వృథాప్రసంగముచాలించి గ్రుక్కుబడఁగ చిక్కిన మొనలతో పురంబుజేరుదము కానిండు.

దుర్యో—ఎవరు ఫణిహారా!

సే—క్యా మహారాజ్.

దుర్యో—బానిన వినుము.

గీ. మూర్ఛమునిగిన సేనలుమూర్ఛదెల్పె
కరిపురంబును జేర నాసేనలకును

యాజ్ఞయిచ్చితినని నుడివివేగిరముగ
కదలుడీపురము జేరంగత్వరితగతిని.

సే.—(నిష్క్రమించును.)

సేనలు—(ఒకరినొకరు గనుగొని లజ్జనభినయించుచూ కరిపురిమార్గమున వెడలుదురు),

తెరవ్రాలును.



శ్రీ

అ భి న వ

# ఉత్తరగోధనాపహరణము.



## —♦ షష్ఠాంకము ♦—

(ప్రథమరంగము నగరసీమ.)

[విరాటుఁడు కంకుఁడు పాచికలాడుదురు.]

(సేవకుఁడు ప్రవేశము.)

సేవ—పదివేలవందనములు పృథ్వీనాథా!

విరా—సేవకా! ఉత్తరగోధనముల మరలించిరా.

సేవ—విరాటభూనాథభూమింజయుండు కురువార్ధినిదాఁటి గోగణంబుల తోవచ్చుచున్నాఁడు.

విరా—(సంతోషముతో) భేష్ కుమారా భూమింజయా! చిన్నతనముననే జనకునికింత ఉపకారమొనర్చిన నిన్ను స్తుతియించుటకు వేనోళ్ళచిలుకకైనను తరముగాదుగదా. సేవకా నీవతిత్వరితముగ మంగళవాద్యయుత్సవములతో దోడ్కొనిరమ్ము. పట్నమును శృంగారించునటుల చాటింపుము.

సేవ—చిత్తము. ధారుణీశ్వరా వెడలెదను.

[నిష్క్రమించును].

విరా—కంకుభట్టా! నిన్నటిదినంబున సమస్తసైన్యంబులును సుశర్మనెదుర్చజాలమయితిమిగదా. ద్వాదశవర్షంబుల బాలుండగు భూమింజయుండు నాకురుసముద్రము నెట్టుదాటెనోకదా. నా గర్భమున యుత్తరుఁడు జనించినందునకదా ఈకష్టముబాసెను.

నాపుత్రుని సాహసగాంభీర్యవిక్రమము దలచ నామనంబానం
దాబ్ధిని మున్గితేలుచున్నది. కుమారా యుత్తరా! పరవైరిచిత్తరా
నీవేరాజనందనుడవుగాక వీరందరేటరాజపుత్రులు (నా సంతోష
మునకు మేరలేదుగదా.)

కంకు—భూమిపాలా! నీవట్లుతలచకము భూమింజయుండెప్పటికిని నా
కౌరవాబ్ధిగడంగియుండును. బృహన్నల తన నవిరణవిక్రమాతి
శయమున వారినెదిర్చియుండును.

విరా—కంకా! (కోపముతో) మీభూసురులిటులనే బ్రతుకుచుందురు
కాబోలు.

గీ. నాదుహారము మెక్కుచుకంకుభట్ట
నాదుతనయుండు నాధేనువులనదల్ప
వేడిరూపుండు నాహము పేర్చెననుచు
నాదుపుత్రునిచులకగా గంటివటరా.

కంకు—ధరణీశ్వరా! చులకనగా చూచుటగాదు. కారణమున నట్లు
వచించితిని. మీరెన్ని నీచోక్తులాడికోపించినను నిశ్చయముగా
బృహన్నలయే జయించెనుగాని నీతనయుడుగాడు.

విరా—[కోపమున] కంకా! నీవునా యాస్థానమున నుండదగవు. నీ
కిక్కున్నచోటికి వెళ్ళుము. దుర్మార్గ.

[పాచికతో వైచును.]

(కంకునకు లలాటంబున రక్తము కారుచుండ)

సై—(తనలో) క. యిలయిందప్రస్థపురవర
నిలయుండయి యిందప్రీఠనాసీనుడయిన
బలవంతులనగ సోదరు
గల యీతను తుచ్ఛనరునిచే గొట్టుయనేగా.

[రక్తము పవిటచెంగున అద్దుచుండును]

విరా—సైరంధ్రీ! పరులనంటనని శ్రీరంగనీతులు బల్కుచూ నిపుడు కంకునంటితివికావా యిదిపతివ్రతధర్మముగునా.

సై—మత్స్యభూమీశా!

గీ. యితనిరక్తము యన్నిబిందువులుధరను
వ్రాలినను నీదుక్షితినన్నివత్సరములు
కరువుబాధలుగల్గుచు జనసమృద్ధి
క్షేమమొందును వినుమత్స్యభూమినాథ.

వి—[తనలో] ఆహా దైవమా! యంతపనిచేసితిని. అన్యాయముగా భూసురునితట్టి నరకూపాంధకారమునజొచ్చితి. [ప్రకాశముగా] భూసురవంశతిలకా! యీదీనునిరక్షించుము.

[పాదములు పట్టుకొనును.]

కంక—రాజా! విచారించెదవేల మిగిలిన కార్యమునకు విచారింప తగదు. మంగళతూర్యములు వినరావచ్చెను. యుత్తరుని యెదుర్కొందములెండు.

(నిష్క్రమింతురు.)

(ఉత్తరుడు ప్రవేశించును.)

విరా—తనప్రక్కజేర్చి ముద్దుపుత్రా యుత్తరా!

గీ. యెటుల నాకురువార్ధిగడంగినావు
యెటులగోవుల మరలించినెగడినావు
సంగరంబున గలయట్టి సంగతేమి
వేగనాతోడదెల్పుమీ వేడ్కమీర.

ఉత్త—తండ్రిమనభాగ్యవశమున నొకమహామహుని కరుణచే కురుబలంబును జయించి సురభులగాంచగల్గితిని. నాయొక్క శక్తివల్ల కాదు.

విరా__కుమారా! మనయందు నంతకరుణజూపి నామహానుభావుడే వరోనతనిగాంచుభాగ్యము లభించునా.

ఉత్త__జనకా! రేపుగాంచగల్గుదుము. అంతఃపురమునకు పోదము రమ్ము.

విరా__సభాసదులారా! నేటికి సభ చాలింతము.

సభా__చిత్తము.

విరా__(తనలో) కంకుబట్టు తెల్పినటుల యుత్తరుడు పల్కుచున్నాడు కంకుబట్టు మహనీయరూపము కాని వేరుకాదు.

(నిష్క్రమించును.)

---

__♦ ద్వితీయరంగము ♦__

(పాండవులు ప్రవేశము.)

ధర్మ__ (ముఖమున వస్త్రముకప్పుకొని) తమ్ముడా! ధనుంజయా నిన్నటిదినమున నాకురువీరుల నెటులబరిమార్చి ధేనువుల మరల్చితివి చెప్పుము. విననువ్విళ్ళూరుచున్నవి.

అర్జ__అన్నయ్యా కాలుపుత్రా! నాయుత్తరునకు సారధిలేనికతంబున నన్నుసారధిగా గొని యుద్ధరంగమునకు వెడలి నాకురుసేన చూచినంతనే యుత్తరుడు

గీ. నరునిజూచిన జంబూక మురుకినట్లు
కేసరినిజూచి కరులు భయమందినట్లు
కురుకులాంబుధి గన భూమింజయుండు
తేరుడిగ్గియు పురితోవనురుకసాగె.

(అందరునునవ్వుదురు.)

అంతట నేనతనిపట్టితెచ్చి ధైర్యముచెప్పి మననిజమెరిగించి వానిసారధిగాయొనర్చి నేనురధికుడనయి కురుసేన నురుమాడి ధేను

వుల తోడ్దెచ్చితిమి. (చిత్రములన్నియు దెల్పెదనులే సంతోష మొందుదురు) భీముడు ధర్మజునివంకజూచుచూ తమ్ముడా! ఫల్గునా మనయనుజుండు ముఖమునకు వస్త్రంబుయడ్డుపెట్టి యున్నాడు కతంబేమోకదా.

అర్జు—అన్నయ్యా! మీరిట్లు మలినవస్త్రములనుంచుట కేతువేమో దెల్పుము.

ధర్మ—(నిజముదెల్పిన మాప్పువచ్చును) తమ్ములారా! నేను రకనేవస్త్రమునుంచితిని.

ద్రౌప—ప్రాణేశ్వరులారా!

గీ. నిన్నదినమున విరటుడుయమతనూజు
పాచికలునాడ ధర్మజు పరిపాలుతోడ
కురుసముద్రము బృహన్నలనీదినాడు
యనగ పాచికతోడను యతనుగొట్టె

భీము—(కోపముతో) ఒరేవిరాటా! దుర్మదాంధ!

గీ. మంతయుయినను దలపక యమతనూజ
పాచికను తోడ వైచినావటర నీచ
నీదుపాలిటి కాలు వృకోదరుండు [ధర్మజునిజూచి]
సెలవొసంగుము విరటుని దివికిజేర్తు.

ధర్మ—తమ్ములారా! శాంతింపుడు. నాయాత్మ్యభూమీశుడు నజ్ఞాతవత్సరంబున తన బిడ్డలవలె జూచియున్నాడు నుంతికార్యమునకై నతనివధించ తగదు పొద్దగుచున్నది యెవరివుద్యోగములకు వారు చనిరేపుదకాలమున రాజయాస్థానమున బయల్పడుదముపొండు.

(నిష్క్రమింతురు.)

—♦ తృ తీ య రం గ ము ♦—

(యుధిష్ఠిరుండు విరటుని సింహాసనమధిష్ఠించి యుండ కడమవారలు ప్రక్కనసిలుచుకొని యుందురు.)

విరటుడు ప్రవేశము.

విర—కోపముతో కంకా! నీకింత కావరమేల. మత్స్యసింహాసనాధీశుడనయి వైరివీరులశూలమునై మహాగాంభీర్య రాజమార్తాండ రారాజునైన నను జూచినంతనే గుండెగభిల్లన ప్రజలుభయమందుచుండ నీవు నిరాఘాటముగా పీఠమధిష్ఠించినావు మర్యాద [నరుకబోవును.]

భీము—ఓరి విరాటా!

గీ. యింద్రసింహాసనముకు నర్హుడయినయట్టి
మహాత్ముడు యీనీచపీఠమలంకరింప
నర్హుడుగాడని మదినెంచకోరి
మత్స్యభూమీశ విరటుడ మర్యాదనీచ.

విరా—ఓరి వలలా! యీభూసురుని కొరకయి నన్నిట్లు అవమానించెదవా. యీభూసురఘాతకుడు దేవసింహాసనమున కర్హుడా.

భీము—ఓరీ దుర్మదాంధ మత్స్యరాక్షసా! యీమహానుభావుడు భూసురుడుగాడు.

సీ. శ్రీరాజమహారాజ రాజపూజితుడయ్యు
గజపురంబేలు కంఠీరవుండు
నవఖండమండలాధీశుడయి రిపులను
వేడ్కతో జయమందు వీరవరుడు
గాంభీర్యకదన కంఠీరవుండననెగడు
హయమేధయాగాదిహర్షనుండు

చంద్రవంశనృపచంద్రుడౌ యాపాండు
మహిపతిసుత పంచజ్యేష్ఠసుతుడు
గీ. కార్యవాద్విజవర్తన కార్యకుండు
పూనిధర్మంబు పాలించుపుడమిరేడు
ద్వితీయద్రిశంకునందను డనగవెలయు
ధర్మపరుడగు ధర్మరాజితనెగనుము.

విరా—[ఆశ్చర్యమొందును] ఆహా! నాయొక్కభాగ్యము.

అర్జు—విరాటాధిజమౌళి (భీముని జూపి)

సీ. యేఘనుండీభువి యుగరవేయనుకాశి
తొంతంబులనువిను వీధిజేర
యేమహామహానీయుడిలలోన బకుడనెడి
దైత్యునిచెండాడె దర్పణముగ
యేయష్టయైశ్వర్యవంతు డేకాచక్రి
పురజనుల రక్షించెపుడమిలోన
యేభూమిపాలుని సోదరుమృగరుజ
విక్రిముద్రుంచె గాంధర్వవమున
గీ. అట్టిజగదేకవీరుడు కుంతిసుతుడు
పక్షి అనుజాత్ముడయిన వృకోదరుండు
పాండురాజునిపుత్రుడై చెలగువాడు
ఘనుడుభీముండు యీతండు మనుజనాథ.

భీము—నరనాథశ్రేష్టా! [అర్జునినిజూపి]

సీ. పురుహూతపుత్రుడయి పుడమిని జన్మించి
సకలదైత్యులనెల్ల సంహరించి

విలువిద్య నేర్పిన విధ్యనాదునిచేత
మేటయని ద్రుపదజ పట్టికట్టి
ఘోరదానవులయిన కాలకేయుల ద్రుంచి
పరిజలకష్టంబుల గిటడంచి
పాలాక్షుమెప్పించి పాశుపతాస్త్రంబు
గొనిసురాసురులు తనబలముమెచ్చ

గీ. పాంచభూమీశుపుత్రుని పెండ్లియాడి
ద్వారకాపురినాథుడౌ మాధవునకు
ప్రాణసంగడ బాంధవుడనగ వెలయు
సింహపిచురంబు విజయసింహంబుయితడే.

(నకులుని జూచి) యీకుర్రడు

క. సురులకు జ్యేష్టసుతుంఘను
పేరును దామగ్రంధియనగ నీనగరమునన్
తురగముల కాటనేర్పుచు
మరుగుగవర్తించుచుండె మహీపతియినుమా.

(సహదేవునిజూపి) యీతసిపాపడు.

గీ. మాద్రిదిద్వితీయసుతుడు సహదేవుడితడు
తంద్రిపాలుడనంగను ధేనువులకు
రోగబాధలులేకుండ పురమునందు
యున్నవాడితడు మమ్మిపుడుగన్నవాడు.

[ద్రౌపతినిజూచి] యీపతివ్రతాశిరోమణి.

క. పాంచాలుతనయద్రౌపతి
అంచితముగ నీపెనీదునగరంబందున్
గొంచకమాలిని యనుచును
యుంచుకవర్తించుచుండె యీ భూనాథా.

విరా—(ధర్మజుని పాదములపై బడి) ధర్మభూపాలచూడామణీ! యీనీచుని రక్షింపుము. తెలియకపోనిసలుగా నొనర్చిన దోషము క్షమింపుము. నాతప్పులు మనసునుంచకుము. నాకుమీరు యొనర్చిన ఉపకారమునకు మీకేప్రతిచేయవలయునోతోచదు మీయొక్క దయాదాక్షిణ్యములవలనే మత్స్యరాజ్యము పృథివిపై వర్థిల్లె. మీకేమిచేయువాడను. రాజా! భువనపంతేజా!

ధర్మ—విరటా! నీవుమమ్ములను.

చ. ఘనసజ్ఞాతము భంగమొందకను యుద్యోగంబులగూర్చి మమ్మునురక్షించియు యుండుదానికిని ప్రత్యుత్తమౌను ఉపకార మీగణముల్ దెచ్చుట తప్పగాచుటయు యింకన్ నీవుమాకెంతోసన్మానంబున బాధుపై వరలుచుంటన్ జూచుకొమ్మీధరన్.

విరా—అజాతశత్రూ! మాట బంధుత్వముగాదు. నాఉపకారము (అర్జునునిజూచి) అర్జునా! నాయందుదయయుంచి.

ఉ. నాదగుముద్దుపుత్రియగు నుత్తరనత్తును నీకునర్జునా భేదముమాని నందరనుఖంబున నీదఃజేర్చుమయ్యా యో శతముఖనందనా వినుతశీలన మాదగు పాపకార్యముల్ ఛిద్దగనీమనంబునను జేర్చకుమయ్య నమస్కరించెదన్.

అర్జ—విరాటరాజా! అటులయొనర్చుటకు యేలాటిసందేహములు లేవు నేనామెకు విద్య గరపుటచేతనే నామెకు జనకభావము. నీవీకార్యముచేయవలయునని యున్నచో నాకుమారుడభిమన్యునకిచ్చి వివాహము జరుపుము యిదిమాయందరకు సమ్మతము.

విరా—(సంతోషముతో) యవరురా! ఫణిహారా.

ఫణీ—దేవరయాజ్ఞయేమి.

విరా—సేవకా నీవీ క్షణంబున ద్వారకకుబోయి శ్రీకృష్ణబలరామ సర్వబంధు సామంత పరివారముతో అభిమన్యుని దోడ్కొని

రమ్ము—శ్రీకృష్ణభగవానులతో

చ. విరటుని పట్టణంబునను యుండియు కౌరవవీరులందరిన్
దూరమున దుఃఖించవారిగని యుల్లసమంజును తనదుపుత్రికా
యుత్తరనిత్తు నర్జునకంచు సుహీపతి బల్కినారు నా
గన్నన కీవ్వనంచు తగజెప్పియు నిట్టులటంచు బల్కినన్.

తే. గీ. బంధుభృత్యాదివర్గ పరివారసహిత
ముగను అభిమన్యు నాముద్దుసుతునినిటకు
తెమ్మటంచును నాధర్మసూనుడిటకు
చనుటకాజ్ఞ నొసంగెనో సార్వభౌమా.

యనితెల్పి తోడ్కొనిరమ్ము.

సేవ—చిత్తము.

(నిష్క్రమించుచు.)

తెరవ్రాలును.

---

## —♦ చతుర్థరంగము ♦—

[ద్వారకాపురి—శ్రీకృష్ణసభ]

(శ్రీకృష్ణ బలరామయువకులు ప్రవేశము.)

శ్రీకృ—సభికులారా! పాండవులు యున్న జాడలు తెలియరాకున్నవి వారలు నెట్టి బాధలను గనుచుచుండిరో కదా. కాలమాల్య మెవరివశము కష్టము సుఖము సుఖము కష్టముగాను మారుచుండును. హా! పాండవులారా!

గీ. సత్యసంధులు యని లోకమందు నెగడ
యున్నవారికి నెట్టి కాలంబుగూడె
త్వరలో మీకష్టములుదీరు గలవునమ్మి
ధన్యగుణులార పాండవ కుమారులార.

(సేవకుడు ప్రవేశము)

సేవ—సలామ్ శ్రీకృష్ణమారాజ్

శ్రీ—నీవెవరవు యేనగరమునుండి చనుదెంచితివి.

సేవ—మారాజ్! మాదె మత్స్యానగర్ విరాటా రాజాసేవకుడు మే
మై మత్స్యాదేశం! మత్స్యాదేశం!

శ్రీ—అయిన నిటు చనుదెంచుటకు కారణమేమి.

సేవ—రాజా! దుర్యోధనారాజ్కా వచ్చి మారాజ్కా ఆవులతోల్కో
పోతూయున్నాడు అపుడూ రాజూగాన్ మైనె పుర్ కెచెటా
పుత్తర్దుమాకీ అర్జన్ కి లేకో యుద్ధాన్కి చల్ గయా అర్జనవార్కి
మార్నెకో మర్గయాఅయినార్. గోవ్లతోల్కొచ్చినాడ్ అం
దుక్క పుత్తర్కి అర్జన్కి దేతామన్నారు. అర్జనానాకీ నకో మైబేటా
అభిమన్కి చేయమన్నాడ్. అందుక్క మారాజాసమ్మతించ్
తుమ్కులేకో హ్వాకతే బోలేడ్ మారాజ్.

శ్రీకృ—అటులయిన పాండవులు మీాపురమున యున్నారు.

సే—క్యా బే ఓబోల్ నెకో క్యావ్ తబ్ కుపూస్తాహె సచ్చిహైచే.

శ్రీకృ—సరి. సరి. సేవకాయిటురమ్మ.

సేవ—ప్రవేశించును.

శ్రీకృ—నీవతిత్వరితముగా సైన్యబంధువర్గముల నాయుత్తపర్చుము.
మత్స్యపురంబునకు పోవలయును.

సేవ—చిత్తము. (నిష్క్రమించును).

శ్రీకృ—అన్నయ్యా! బలరామావింటివా. పాండవులజాడలు మన
మతిత్వరితముగా నేగవలయులెండు.

బల—అనుజా! అటులనే నేగుదము.

(శ్రీకృష్ణ బలరామసైన్యము నిష్క్రమించును)

[తెరవ్రాలును].

## —♦ పంచమరంగము ♦—

### సభామంటపము.

(విరాటుడు సభయుండ శ్రీకృష్ణుడు ప్రవేశించును).

అందరు—పదివేలవందనములు. పరమపురుషా.

ధర్మ—వాసుదేవా పదివేలవందనములు.

శ్రీకృ—బావాయుధిష్టరమహారాజా! అజ్ఞాతవాస మెట్టుకడతేర్చితిరో కదా. విరాటారాజుమీాకుయిచ్చిన యాహారదోషంబున నతని గోగణంబులమరల్చితిరి. అందులకుదగు ప్రత్యుపకారము చేయు చున్నాడు. మనస్సుపూర్తిగా యీాకార్యమును జరిగింపుము.

అర్జ—పుండరీకాక్షా! అదియంతయు నీఅనుగ్రహమేకదా. సర్వకాలము ల నీదయవలనగదా కడతేరుచుంటిమి. మీారు మాయందుదయ జూచుచుండ నెట్టికష్టములయినను సుఖముగాయుందును.

శ్రీకృ—మత్స్యభూమీాశా! శుభకార్యము నెపుడు నిశ్చయించిరి.

విరా—మధుసూధనా! రేపువుదయము రోహిణీనక్షత్రకన్యాలగ్నమున ఘడియలకు నిశ్చయించితిమి.

శ్రీకృ—అయిన వలయుకార్యముల చక్కచేయుడు.

విరా—కుమారా వుత్తరా ! నీవతివేగంబున నగరికిజని బంధుజనులకు వలయువిడుదులు గావింపుము అంతఃపురస్త్రీలను ఉత్తరను దోడ్కొనిరమ్మని దెల్పుము

ఉత్త—తండ్రీ ఆజ్ఞశిరసావహించెదను.

(ఉత్తరప్రవేశము)

విరా—సభాసదులారా !

గీ. నాదుపుత్రిక నుత్తర కన్యనిపుడు
క్షితినిపార్థుని సుతుడు సౌభద్రునకును

నొసగి నిప్పుడివాహ మహోత్సవంబు
జరుప యిష్టమెకద మీకు సభ్యులార.

అందరు—మహాభాగ్యము!

శ్రీకృ—విరాట ధరణీశ్వరా! పలయుపనులు కావింపు.

విరా—ఎవరు.

సేవ—స్వామీ మహాప్రసాదము!

విరా—నీవతిత్వరితంబునజని భూసురోత్తములను దోడ్కొనిరమ్ము.

(నిష్క్రమింతురు.)

[భూసురులు ప్రవేశింతురు.]

అప్పావధానులు—సుబ్బావధానులూ! విరాటునిపుత్రివివాహమహోత్సవమునకు పష్టాట్రా నేవెళ్తున్నా.

సు—నేనురావలయుననే వుద్దేశంగాయున్నదిరా. నిన్న పేరంభొట్లుగారి యింట్లో బ్రాహ్మణార్థముకు భోంచేసిన గారెలుబూరెలు అతిరసాలు బొబ్బట్లుపూరిలు పూరిలునెయ్యి శాఖపాకములు యింకనుకుత్తుకలోయున్నది. అయినను వస్తానురా.

(దారిలో రామశాస్త్రి వెంకటశాస్త్రి వెళ్ళుచుందురు.)

అప్పా—యవరారా! అటువెళ్ళువాడు (నిదానించి) కొండుంబట్టూ.

కొం—ఎవరురా అక్కడ.

అప్పా—నేగదటరా కొండుంబట్టు.

కొం—ఒరేనీవ్వవరా అప్పావధానులు నిన్నుగదవరా.

అప్పా—వీడెవరు.

కొం—మల్లాశాస్త్రులకొమారుడు రామశాస్త్రి.

అప్పా—ఒరే! నివ్వవరా రామా నిన్ను చూచినముందు తీర్థయాత్రి పోయేటప్పుడు చూచినదే కాబట్టి గుర్తించలేదునాయనా. యితనెవరు!

రామ—యితను వెంకుశాస్త్రి గదప్పా !

అప్పా—అవును మరిచినాను హస్తిపురము బోవుమార్గములో నాతో సంభాషించుచూ వచ్చినవాడవుగదూ. నాయనానీతాతగారి అవ్వ మాతాతగారిముత్తాత చిన్నాయన కుమారుడీకూతురు మనుమరాలు కూతురుపౌత్రి మనవాడివే బంధుత్వములు.

సేవ—భూసురులారా ! రాజేంద్రుడు తొందరచేయుచున్నారు. రండు.

రా—వస్తున్నాముగా పాకువీకట

(భూసురులు ప్రవేశము.)

విరా—భూసురోత్తములారా ! త్వరగా కార్యముజరిగింపుడు.

భూ—పెండ్లికుమార్తెను పెండ్లికుమారుని నిటు పీఠాసనములమీద కూర్చుండబెట్టుడు.

(అభిమన్యు నుత్తరలుప్రవేశము.)

(పీఠాసనములపై కూర్చుందురు.)

భూ—(సభాసదులకక్షితలివ్వ అక్షితలు బుచ్చుకొని) సుభభవ సుభభవ దీర్ఘాయురారోగ్యమస్తు (అని గొణుగుచూ) అభిమన్యా ! మంగళసూత్రము కట్టుము. (అటులచేయును) (చేయవలయు వివాహకార్యములు జేయునపుడు కార్యములు పూర్తియగును వెడలుదురు)

సభాసధులు—అక్షితలుజల్లి.

(మత్తకోకిల)

మంగళమునరనందనా సౌభద్రి శశికులపావనా
అంగనా హృదయారమదనా అంబుజాక్షు సుధవనా
యుత్తరా మానినిగను ప్రసిద్ధితంబుగ నీకునూ
యుత్తమని విరాజు యిప్పుడే యిచ్చుముచ్చట దీర్చెనూ
ధరను నాయురారోగ్యము భువిగల్గిమీారలు సుఖముగా

శరమరందుగ వర్ధిల్లుచును ఘనముగా యుండేరుగా
జయము జయమగునీకు నోసాభద్రిక్రీడిసమాత్మజా
జయముగూడను యిహపరంబున జయము యుత్తరయాత్మజా.

విరా__సభాసదులారా! మీరుమీయొక్క యాసనములనుండి నాయొక్క చందన తాంబూలాది గౌరవములుగొనుడు.

అందరు__(గైకొందురు)

విరా__కాలకృత్యములకు లెండు.

అందరు__ [నిష్క్రమింతురు],

తెరవాలును.

మత్తకోకిల.

మంగళంబిదె వసుధవలేల్పూరిమందిర రఘుకుల
రాఘవేంద్రవేగగొని మదికరుణజూడుము నన్నిల
అభినవాఉత్తరగోధనాపహరణము యీకృతిన్
అభిమతంబుగ యొనర్చినాడను ప్రీతిచేకొనునాకృతిన్.

గద్య.

ఇది శ్రీరామచంద్ర పాదసేవాధురంధర వలేటవారిపాలెపుర
మందిర చతుర్థవర్ణశ్రేష్ట కంచర్లగోత్రోద్భవ రావివంశ
పయఃపారావార రాకాసుధాకర లక్ష్మాంబగర్భ
సుక్తముక్తాఫల అప్పయామాత్యద్వితీయా
తనూభవ గజరాజచరిత్రరచనానైక
అచ్చియామాత్యప్రణీతంబయిన
శ్రీ అభినవ ఉత్తరగోధనాప
హరణమనునాటకరాజం
సంపూర్ణము.



## భరతవాక్యము.

శా. వ్రిజనాథుండు ప్రజానుకూలముగ పరిపాలంతాఁజేయ జా
యజసమృద్ధిగ సస్యక్షీరశయముఁ భూగోవులుఁ యిచ్చుచు
నాభుజగేంద్రుఁ దలఁపెట్టజారచోరాదిత్య విష బాధలుఁ
మత్ ప్రజకష్టంబులులేకనిర్జరముగా సత్యంబుపాలించెడిన్.

సమాప్తము.



శ్రీసత్యానందప్రెస్ ఇన్నీసుపేట, రాజమండ్రి.